# వేశ్యాహితబోధిని

ఇది

మహాభారతసార గ్రంథకర్తయగు


ద్రోణంరాజు సీతారామారావుచే


రచియింపఁబడినది


నాల్గవ కూర్పు 1000, ప్రతులు.

కొండపల్లి వీరవెంకయ్యచే

ప్రకటింపఁబడియె.

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1924.




[వెల 1-0-0.



# వేశ్యాహితబోధిని.



రంగము:—చంద్రవదన:—(గృహములో ప్రవేశము.)

చంద్ర—ఆహా! దిక్కుమాలిన వ్యభిచారమునకు విధివిరామము లేక పోవుచున్నది. ఇందులగూర్చి మాతల్లి బలవంతము మఱీయెక్కువయైపోయింది. ఏరోజుచూచినా అస్తమానం దాని నల్లమందుకే రోజుకు ఒకరూపాయి కావలసి వస్తూవుంటుంది. ఎందాకాలని నేను తెచ్చి యివ్వగలను. ఎవ్వరినిజూచి నాముందుగా నాలుగు జాబుసరి కబురులు చెప్పడం, తరువాత నాలుగు రోజులు వుండిపోవడమేగాని నమ్మకంగా కొన్నాళ్ళయినా వుంచుకుందామనేవాడు యెవ్వడూ కనిపించడు. పట్టి సరసాలకే యితేరోజూ అందరూస్నేహితులే. ఏంచంద్రవదనా యేమిచేస్తున్నావు. పలకరించడానికి వచ్చేవాళ్ళేగాని డబ్బు దగ్గిరమాత్రం ప్రాణంతో లంకె వేసుకొనియుంటారు. ఇప్పటికి నామనస్సులో వున్న విచారములు కొన్నితగ్గినాయి. ఏమంటె నన్ను ప్రాపుకారు ఒకడు చేరదీసినాడు. ఈయన చాలామంచి వాడున్నూ డబ్బుకోసం వెనుకతీసేవాడున్నూ మాత్రంకాడు. అదికాకుండా నేను యెల్లాచెప్పితే అల్లావుంటాడు. ఏదోలీజోక్యాం అక్కరలేదు. ఇంకనాకు పరవాలేదు. నాకూతురుగూడా యిట్టిధనం కలవా

డినే యొకడిని సంపాయిస్తే నాకు మనస్సులో యింక యేవిధమయిన చింతా వుండదు. కాని, అది నెమ్మదిమీద ప్రయత్నం చేయాలి. నన్ను వుంచినషావుకారుకూడా అమ్మాయి విషయంలో మంచివాళ్ళను ఆలోచించాలని చెప్పుతూవుంటాడు. ఆయన చాలామంచివాడు. నాసంతానమును ఆయనకన్న సంతానంకన్న యెక్కువగా చూచుకొంటూవున్నాడు. మాపిల్లలుయెవరయినా అవతలకు వెళ్ళితే అసహ్యించుకోనకుండా, తనపిల్లలే అనుకొని యెత్తి పారవేస్తూ వుంటాడు. లోకంలో బోగంవాళ్ళను వుంచుకొన్నవాళ్ళు యెవళ్ళయినా యిల్లాచేసినారా!

తే. గీ. గడచిపోయిన దేదియో । గడచిపోయె
యింకనైనను నేనెప్డు । హీనమతిని
వారివీరిని ధనముకై । చేరకుండ
యితనినే నమ్మియుండంగ । నెసగునాకు

అవును. ఇంకొకరితో నాకు యవసరమేమియున్నది? ఇతడునాకు కావలసినంత ధనంయిస్తున్నాడు. వంటినిండా నగలు చేయించినాడు. నేనున్నూ నాపిల్లలున్నూ కూడా బంగారంలో తులతూగుతున్నాము. ఇల్లా మహావైభవంగా వుంటూవున్నప్పుడు మరొకరితో సంబంధం కలుగజేసికొన్నానంటే యీతడు నాముఖంచూస్తాడా. అది యెంతదోషం. నేనిప్పుడు గడిస్తున్నధనం తరతరములు నామనమరాళ్ళు, నామునిమనమరాళ్ళుకూడా అనుభవించవచ్చును. కాని నేనెప్పుడూ యింతభాగ్యవంతుడిని వుంచుకుంటానని అనుకోలేదు. పాపము షావుకారుగారు, నన్ను మేళములలోనికి వెళ్ళవద్దని చెప్పుతూవుంటారు కాని, అలవాటుచేతనున్నూ, మేళమునకు నాయకురాలనై యుండడముచేతనున్నూ, వెళ్ళకుండా వుండాలంటే యేమీతోచదు. అందుచేత యెప్పుడయినా

కాస్త వెళ్ళిపోతూవుంటాను (ఎదుటజూచి) అదుగో! సుబ్బయ్యశెట్టిగారు వస్తూవున్నారు.

[సుబ్బయ్యశెట్టి ప్రవేశము.]

సుబ్బ—(తనలో) ఆహా! నాకీచంద్రవదన నేనుయెంతో పుణ్యంచేసుకోబట్టి లభించినది గాని సామాన్యులకు లభించేటటువంటిది గాదు. బ్రాహ్మణులు రంభాసంభోగంకోసం యజ్ఞాలు చేస్తారు అని చెప్పుతారు. కాని ఆరంభకూడా దీని కాలి గోరుకైనా పనికిరాదు. నేను యజ్ఞయాగాలు చేయందే యీచంద్రవదన నాకు లభించినది.

తే. గీ. అట్టిరంభయే నన్నుఁ గృతార్థుఁ జేయ
చంద్రవదన రూపముదాల్చి ధాత్రితలమున
జననమందె నటంచు మను స్వాంతమందు
తలతుఁ గాకున్న యీసొంపు గలుగనగునె.

(చంద్రవదనను సమీపించి) ఏమే! ఏం చేస్తూవున్నావు.

చంద్రి—చెయ్యడానికి యేముంది. సరేగానీ యీవాళమీరు యింత ఆలస్యంగా వచ్చినారెందుచేత?

సుబ్బ—ఈనాళటిరోజున కాస్త కొట్టుదగ్గర వ్యాపారంమోపుగావుండటంచేత ఆలస్యమైనది. మరిన్ని యింతేకాకుండా, మరలపాడు కాపురస్తుడు నీవెఱుగుదువా. వెంకటరామయ్యగారు యేదో వ్యవహారంమీద అనగా వ్యవహారమేముందిలే, ధాన్యం తోలించుకొని వచ్చినాడు అవి కాటా వేయించడం, ఖరీదుకట్టడం, పస్తు యియ్యడం మొదలయిన పనులన్ని తేల్చడానికి ఆలస్యమయినది.

చంద్రి—ఏమిటీ! ఆరామయ్యగారు యిక్కడకు వచ్చినారా యేమిటీ! ఎప్పుడు వచ్చినారు. ఇంకా చెప్పరు.

సుబ్బ—నువ్వాయన్ను బాగా యెరుగుదువా యేమిటి!

చంద్రి—ఆయనతో యెప్పుడూ మాట్లాడియెఱుగను గాని, ఆయన ముఖంమాత్రము చాలా సారులు చూచినాను. ఆయనచాలా గ్రంథసాంగుడే.

సుబ్బ—ఏమిటేవు. ఆయనవిషయం చాలా యిదిగా చెప్పుతున్నావు. నీకెల్లా తెలుసునేమిటి?

చంద్రి—మీరెప్పుడూ ఆయనవిషయమై యెరుగనట్లే అడుగుచున్నారు. మన నీలాచలమును కొన్నాళ్ళు వుంచుకొనలేదూ.

సుబ్బ—ఆహాహా! నీలాచలం యిప్పుడు యీతనిస్వాధీనములో లేదా యేమిటి?

చంద్రి—యెల్లావుంటుంది. ఆయనయందు విశ్వాసముంచి వర్తించింది గనుకనా.

సుబ్బ—ఏంచేసిందేమిటి?

చంద్రి—ఎందుకు అడుగుతారు. చెప్పడానికి గూడా సిగ్గవుతూవుంది.

తే. గీ. ఎంతయో ద్రవ్యమిచ్చుచు । స్వాంతమందు
భవ్యసత్కృపతో నిజ । భార్యకంటె
నెక్కుడుగ జూచుచుండెడు । నితని; కన్ను
చాటునఁ బరులగూడంగ । సాగెగాదె.

అది యెప్పుడో ఈయన కళ్ళయెదుటపడ్డది. అప్పటినుంచి ఆయన దానియింటికి వెళ్ళడం మానేశాడు.

సుబ్బ—అవును. మరి, అల్లాటిపనులు చేస్తూవుంటే ఆయనకు కోపం రాదూ. ఆయన యేమిఅయినా తక్కువచేశాడు గనుకనా. అన్నివిధాలా ఏదికావలస్తే అది యిస్తూ రాణీకిమల్లె చూస్తూవున్న పెద్దమనిషిని మోసంచేస్తే యెల్లావుంటుంది. అదియేమి కర్మమోగాని యెంతడబ్బుయిస్తూవున్నా వాడితో సంతృప్తి

కొందక, పైగాతిరగడం వేశ్యలలో అందరికీ ఆచారమైయున్న
ది. అందుచేతనే వేశ్యలను యెవ్వరినీ నమ్ముటకు వీలుపడదని
అంతా చెప్పుతారు. విశ్వాసం, నీతిలేనికులం యేదంటే భోగం
కులం. అని ధర్మశాస్త్రములలో కూడా చెప్పబడియున్నది.

చంద్రి—(తనలో) ఈయన పైకి వెఱ్ఱిబాగులవాడులాగున కనుపడుతా
డుగాని సామాన్యుఁడుఁగాడు. వేశ్యలయొక్క మోసములు బా
గా తెలిసినాయి. (ప్రకాశముగా) ఏమండోవ్ మీరువరసాగ్గా
అందరిని చుట్టబెట్టి అనేస్తున్నారు. దానిఖర్మా అంటే అల్లా
కాలిందిగాని అందరిదీ అల్లాగేనా. మీరన్నమాటలకు వప్పు
కోవలసిందేగాని మొత్తముమీద చాలామంది నీతిగలవాళ్ళు
గూడావున్నారు. ఇంకా సంసారంచేసే ఆడవాళ్ళకంటే మా
భోగంవాళ్ళలోనే కాస్తనీతివుంది. ఈకాలంలో సంసారస్త్రీలు
మామీద "కాంపిటీషనుకు" వచ్చినారుగదా.

సుబ్బ—ఇదిగో. ఇంకేం. యింగ్లీషుముక్కలు గూడా నేర్చుకున్నావు,
యెక్కడనేర్చినావు యేమిటి? యింగ్లీషులో వుత్తరాలు వ్రా
యగలవా? మనవ్యాపారం బాపతు వుత్తరాలన్నీ నువ్వువ్రా
యరాదూ. కొట్టుదగ్గిర గుమాస్తాయెందుకు నెల 1 కి 15 రూ.
యిచ్చి.

చంద్రి—సరిలెద్దురూ. మీ వేళాకోళాలకు, యెప్పుడూ యిల్లాగే అం
టారు. ఖర్మంచాలక నోరుజారింది.

సుబ్బ—కోంపడకుగాని, మన అమ్మాయి యెక్కడవుంది?

చంద్రి—ఏం, ఇప్పుడు అమ్మాయి అవసరంయేమి వచ్చింది?

సుబ్బ—చూడాలి. అమ్మాయితో పనివుంది. దాన్నిచూడడానికి ఒక
పెద్దమనిషి వస్తానన్నాడు. బాగాముస్తాబై యుండమని చెప్పు.

చంద్రి—ఎవరబ్బా! ఆపెద్దమనిషి.

సుబ్బ—త్వరగా తీసికొనిరా. ఆయనకు అభ్యంతరము యేముంది. మన వాళ్ళే. రమ్మను రమ్మను.

బంట్రోతు—చిత్తం బాబయ్యా.

[వెంకటాద్రియ్య ప్రవేశము]

సుబ్బ—ఓహో! వెంకటాద్రియ్యగారా! దయచేయండి. మొత్తానికి అన్నమాట తప్పరు.

వెంక—ఎందుకు తప్పవలెను. మీతో చెప్పిన "టైము"కన్న ఒక్క అరఘంట ఆలస్యమైనది.

సుబ్బ—అంతమాత్రానికేమిలెండి. (చంద్రవదనను చూచి) ఒసే! అమ్మాయిని ఒకసారి యిల్లా పిలువు.

చంద్ర—ఇదిగో. పిలుచుకొనివస్తాను. (నిష్క్రమించి వెంటనే సింహాచలముతో ప్రవేశించును.)

వెంక—(సింహాచలమునుచూచితనలో) ఆహా! ఏమిబ్యూటిఫుల్ గర్ల్! సుబ్బయ్యశెట్టి చెప్పినదానిలో అబద్ధం యేమీలేదు. అంతా తల్లిమోస్తరే. నేను దీనిని చిన్నప్పుడు చూచినాను. అప్పటికీ యిప్పటికీ చాలా వ్యత్యాసముగానున్నది. ఆడవాళ్ళకువయసు వచ్చినప్పుడేగదా అందం కనపడుతుంది. ఇల్లాంటి దివ్యమంగళ స్వరూపాన్ని నాబోటి ధనికులు వుంచుకొనిగాని లేకపోతే పాడయి పోతుంది. ఇదివరకు నేనువుంచుకొన్న నీలాచలం దీనిఅందచందాల్లో సహస్రాంశమైనను పోలదు. నా ఏజ్ కి, నాహోదాకు, నా భాగ్యానికి, నాసరసత్వానికి యిది నిశ్చయంగాతగివున్నది. ఎంతడబ్బు వ్యయమైనాసరే దీనిని నాయధీనలో వుంచుకోవాలి. ఇది మహాబ్రహ్మాండమైన ఖర్చు అప్రతుల్యమని అనుకుంటాము గాని నేను కాల్చివేసే "త్రీకాసిల్సు సిగరెట్లు"కు అయ్యే ఖర్చంతయినా దీనిని పోషించడానికి పట్టదు. ఏమైనా

దీ

సరే. దీనినిప్రుంచితీరవలెను. నేను వుంచుకోవడం సుబ్బయ్యశెట్టి కికూడా చాలాసంతోషమే. అందుకోసమే తెలుచునాతోయీ సింహాచలాన్నిగురించి చెప్పుతూవుంటాను. నిజంగా దీనియం దంముందు యెవ్వరూ సరిరారు.

చ. కనుఁగొననో ధరాస్థలినిఁ । గంజదళాక్షులనెందరెందఱన్
మునుపెప్పుడైన సెట్టిపుర । బోడినిఁ గన్నులఁ జూచియుంటినే
మనసిజకాంతయైనరతి । మాడ్కి—బ్రకాశము నొందుచున్న యీ
వనితను యిట్టిచందమున । వారిజసంభవు డెట్టుచేసెనో.

చ. కలువలుచేత గన్నుగవ । కంజముచేత మొగమ్ము; మల్లెలన్
బలువరుసన్; నవీనవిట । పమ్మున మోవినిఁ జంపకచ్ఛదా
వళిని వరాంగకంబులను । వారిజగర్భుడు బుట్టజేసి యీ
లలనను నానిమిత్తమె యి । లాస్థలినుంచె నటంచు నెంచెదన్.

ఇటువంటి "బ్యూటిఫుల్ యంగ్ లేడీ"ని చూస్తే వదలిపెట్టడానికి యెవరి "మైండు"ఒప్పుకొనును! దీన్నిచూడగానే నామనస్సంతా చలించుతు న్నది. డ్యామిట్ మన్మథుడు తన "ఫ్లవర్ యారోస్"ఊరికే హరంప రిగా వేశేస్తున్నాడు. వీడి తల్లి బొడ్డుబొక్కా—. వీడు కాముకులనుచూ స్తే ఒంటికాలిమీద నడుస్తాడు. వీడి బాణాలు తప్పించుకోడానికి మందు యేముంది. ఏంకావాలి, వెలకాంతలకూటమి యేమందు. అట్టిది ధన్యు లకు లభించును. ఈవిషయమై కాళిదాసుకూడా తనశృంగారతిలకము ను గ్రంథములో యిల్లా చెప్పినాడు.

శ్లో. గాఢాలింగన పీడిత స్తనతటం । స్విద్యత్కపోలస్థలం
సందష్టాధర ముక్తసీత్కృత మభి । భ్రాంత భ్రూవ్యత్కటిమ్
చాటుప్రాయవచో విచిత్రిమణితై । ర్ఘాతం రుతైశ్చాంకితం
వేశ్యానాం ధృతిధామ పుష్పధనుషః । ప్రాప్నోతిధన్యోరతమ్."

మరించేత యీసింహచలాన్ని వుంచుకోవడానికి నేనుసమ్మతించడం చేత

నేను ధన్యుడనే. అందులో యిటువంటికాంత నాను సంప్రాప్తించడానికి సిద్ధంగా వుండడంచేత నేను మరింత ధన్యుడను. ఆహా!

సీ. ఏవ్వానియింట నీ । యింతియుండును; సదే
యిందిరాసుందరీ । మందిరంబు
తరుణి నెవ్వాని । స్మరియించు వాడెపో
సకలసద్విద్యావి । శారదుండు
చానతో నిరతంబు । సౌఖ్యంబు గాంచుట
యాందితానంద సా । మ్రాజ్య పదవి
ఈకాంతతో గూడి । యేకాంతమాడుటే
హరిని సేవించిన । యట్టి ఫలము

తే. గీ. గాన; నీసరోజాక్షినిం । గంబుకంఠి
గుతుక మడరంగ జేబట్ట । కుంటి నేని
మదను డదయుడై శరముల । యెదను బఱపి
జీవముల గొన నెంచడే । చిత్తమునను.

ఏమైనాసరే. నాడబ్బుఅంతా ఖర్చయినాసరే. వున్నా పొలాలన్నీ తాకట్టుకు వెళ్ళినాసరే. తుదకు నేను చచ్చినాసరే. నేను దీనిని వుంచుకొనక మానను గాని కొందరు లోకులు యీవిషయమై యెఱిగిన నన్ను దూషిస్తారు. అయితేనేం. నేను చేసేకార్యం వారిదూషణ భూషణాలకోసం కాదుకదా. స్వసౌఖ్యంకోసం. అందులో సుందరాంగులతో వుండడమే మోక్షముకన్న మోక్షము. అందుకనే కాళిదాసు బాగాఆలోచించి యిట్లావ్రాసినాడు.

"శ్లో. అవిదితసుఖదుఃఖం నిర్గుణం వస్తుకించి
జ్జడమతిరిహకశ్చిన్మోక్ష ఇత్యాచచక్షే
మమతుమతమనంగ స్మేర తారుణ్యఘూర్ణ
న్మదకలమదిరాక్షీ నీవిమోక్షోహిమోక్షః॥"

అనగా "మూఢులైనవాళ్ళు కొందరు నిర్గుణమైన కాస్తసుఖమన్నా ఇయ్యనిదాన్ని మోక్షమంటారు. గాని నామతాన్ని బట్టి చూడగా సకలకళాప్రవీణయైన కాంతతోనుండుటయే మోక్షము." కాబట్టి యెవరు యేమనుకుంటే నాకు యేమిపోతుంది? ఒకళ్ళు నాకు యెవరూ పెట్టనక్కరలేదు. కావలిస్తే నేనే ఒకరికి పెట్టుతాను.

సుబ్బ—ఏమిటో వెంకట్రామయ్యగారు మహాఆలోచిస్తున్నారు.

వెంక—సుబ్బయ్య శెట్టిగారూ. ఆలోచన యేమీ లేదు. "ఐ హావ్ ఓన్లీ సారి టు సే దట్ గాడ్ హ్యాజ్ నాట్ గివెన్ మి సమ్ మోర్ అయిస్ టు సీ దీ బ్యూటీ ఆఫ్ దిస్ సింహాచలం."

సుబ్బ—"యూ యాప్రిసియేట్ హర్ బ్యూటీ"?

వెంక—వై నాట్?

చంద్రి—మీరిద్దరూ యేమిటో ఇంగ్లీషుమాటలాడుకోవడం ప్రారంభించినారు. అదియేమిటో మేము వినకూడదా యేమిటి?

వెంక—మరి వినకూడని రహస్యాలు మాకేమున్నాయి?

సుబ్బ—(చంద్రివదనంతో) ఏమే! పంతులుగారు సింహాచలాన్ని చూడడానికి వస్తే చూపించవేమిటి?

చంద్రి—ఇదిమరీ బాగుంది. పిల్లవచ్చి యిక్కడ కూచుంటే యెంతసేపయింది?

సుబ్బ—అవునే. కోప్పడకు (రహస్యముగా) నేను నెమ్మదిగా అవతలకు వెళ్ళుతాను. ఈయన సంగతిసందర్భాలన్నీ నీవు కనుక్కో. అయినా వ్యవహారం అంతా నేనే "రైటు" చేశానులే. (వెంకట్రామయ్యనుచూచి) పంతులుగారూ! మీ భోజనంఅయిందా!

వెంక—అయింది.

సుబ్బ—మీరు చక్కగా మహారాజులు, పెందరికాడే మాకు భోంచేయడానికి వీలు లేకదా. కొట్టుదగ్గిర వ్యాపారాలు చూచుకొని వచ్చేటప్పటికి పన్నెండుఘంటలవుతుంది. అప్పుడు స్నానంచేసి భోంచేసేటప్పటికి రెండవుతుంది. మాకోమట్లయిళ్ళలో పగలు రెండుఘంటలకు రాత్రిపదకొండు ఘంటలకున్నా భోజనాలు అవడం.

వెంక—(నవ్వుచూ) డబ్బురంధిమీద పడితే ఆకలివుండదుకాదట్రా.

సుబ్బ—(పిచ్చిమాటగాని డబ్బు వస్తూ వుంటే ఆకలి చస్తుందండీ. నేను త్వరగా స్నానంచేసి భోంచేసివస్తాను. ఇక్కడ నేదయచేయ్యండి.

వెంక—ఇందాకటినుంచి నేను మీరుభోంచేశారని నేను అనుకుంటూ మాట్లాడడంలో ఆలస్యంచేశాను. త్వరగా వెళ్ళిభోంచేసిరండి.

సుబ్బ—(నిష్క్రమించును.)

చంద్రి—సింహాచలమూ! తాంబూలం తెచ్చి పంతులుగారికియ్యి.

సింహా—(సిగ్గుపడును)

చంద్రి—సిగ్గుపడుతావెందుకు. అమ్మాయీ వెళ్ళి పట్రా.

సింహా—(నిష్క్రమించి వెంటనే తాంబూలపు పళ్ళెముతో ప్రవేశించును.)

చంద్రి—ఇలాతే అమ్మా! (పళ్ళెముపుచ్చుకొని ఆకులురాశి) అమ్మాయీ! ఇవి ఆయనకు యియ్యి.

సింహా—నువ్వియ్యి. (రోషముతో చూచును.)

వెంక—తే. గీ. చిత్తమందున నున్నట్టి । సిగ్గుచేత
కాంత కన్నుబొమ్మలను నెక్కి । గా! నొనర్చి
తాంబూలం బీయజాలక । దల్లినీయు
మ్మాయనుచుఁ బల్కుచున్నది । మగువమిన్న.

చంద్రి—ఏకాంత సిగ్గయితే యెల్లాగ. (వెంకటాద్రయ్యగారిని జూచి)
పంతులుగారూ! ఇదుగో తాంబూలము.

వెంక—(పుచ్చుకొని)

తే. గీ. లజ్జచేతను సింహాచ । లంబు తాంబు
బంబు నీయంగమదిని భ । యంబునందె
గాని; దానిహస్తములతోఁ । గరుణఁబూని
యిచ్చియుండిన మోదంబు । హెచ్చుగాదె.

ఈ తాంబూలమే సింహాచలము నాకిచ్చియున్నచో నాసంతోషానికి మితి
లేకయుండును గదా!

తే. గీ. ఇంతి తాంబూలమిచ్చుట । యెన్నడబ్బు
చపల నయనతో భాషించు । టెపుడుగల్గు
కాంతఁ గౌగిట జేర్చు సౌ । ఖ్యంబు నెపుడు
గందు; ననుచు నున్నాఁడ నా । నందమెసఁగ.

(తనలో) ఓ మనస్సా! కాస్త వోపికబట్టు. నీమనోరథము త్వరలో నేతీర్చు
కొంటాన్లే.

చంద్రి—ఏమిటీ! పంతులుగారు దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?

వెంక—మరేమీ లేదు.

చంద్రి—మీరు యిక్కడికి యేపనిమీద వచ్చినారో మేము వినవ
చ్చునుగదా.

వెంక—ఎప్పుడూ వస్తూనే వుంటాను. ధాన్యం విక్రయంకోసం వచ్చి
నాను. అవి యీవాళ సుబ్బయ్యగారికొట్లోనే పట్టుబడిపట్టించి
వేశాను. లెఖ్ఖ సాయంత్రమున్నా రేపుఉదయాన్న పుచ్చుకొంటాను.

చంద్రి—ఏమాత్రమేమిటండి?

వెంక—ఏమాత్రము అయిదువందలపుట్లు.

చంద్రి—ఇవి అన్నీ తమసొంతధాన్యమేనా?

వెంక—అవును.

చంద్రి—పంతులుగారూ ! కాస్సేపు పడుకుంటారా యేమిటి ?

వెంక—పగటినిద్ర యెప్పుడూ అలవాటులేదు. సుబ్బయ్యశెట్టిగారు వస్తే ఆయనా నేనూ కొట్టుదగ్గిరకు వెళ్తాము.

చంద్రి—సుబ్బయ్యగారితో కొట్టుదగ్గిరకు వెళ్ళకపోతే యిక్కడవుండకూడదా యేమిటి ? దస్తువారు యిక్కడకు పంపరా యేమిటి ?

వెంక—నేను దస్తుకోసంగాదు వెళ్ళడం. పొద్దుపోతుందని.

చంద్రి—ఇక్కడ పొద్దుపోదు కామోసు. ఎందుకుమీరు శ్రమపడడం ఇక్కడ వుండండి.

వెంక—పోనీ ! ఎక్కడనయితే నేమి ? యిక్కడే వుంటాను.

చంద్రి—పంతులుగారూ. మీరు మా పెద్దవారండీ. మీహృదయము సముద్రముకంటె లోతుగలదై వున్నది. మీరువచ్చిన కార్యాన్ని గురించి కాస్త అయినా మాట్లాడకుండా యున్నారు కదా.

వెంక—నే నేకార్యంమీద వచ్చాను ?

చంద్రి—ఆసంగతి మీరు చెప్పకపోతే సుబ్బయ్యశెట్టిగారు మాకు చెప్పలేదనుకొన్నారా యేమిటి ?

వెంక—ఏమిటాసంగతి ?

చంద్రి—ఇంకా ఎందుకుదాస్తారు లెండి. సరే గానియ్యండీ; సింగానలాన్ని మీరు వదలివేయడానికి కారణము యేమిటి ?

వెంక—చంద్రివదనా ! ఆసంగతి నానోటితో యెందుకు చెప్పిస్తావు ? నీవు విన్నావుకదా. మళ్ళీ యెందుకు ?

తే. గీ. అందమైనస్త్రీ కాంతకాక దండుగాదు
ధనము మిక్కుటంబుగనులేక దనుచుగాదు
కాని ; చూడగానితడులఁ గనయాడించి
యుంటచేఁ బాసినాడ నాకిట్లు నిపుడు.

అక్కాంతయొద్ద నేను బ్రవేశించినప్పుడు ప్రారంభమున నాతో జేసిన ప్రమాణానికి వ్యతిరేకంగాబ్రవర్తించింది. అదినాకు అసహ్యంపుట్టింది.

తే. గీ. తాను కోరుచుండినయట్టి । ద్రవ్యమంతొ
యిచ్చినాడను ; వస్తువ్రల్ । దెచ్చినాడ
కొఱతయున్నది యేమిలే । కుండఁజేసి
నాడ ; కాని వంచించెనన్ । నాతిమిన్న.

అట్టియెత దానికిని నాకును మరల సంబంధ ముంచుకొనుట యెట్లు ?

తే. గీ. ఎంతధనమిచ్చుచుండిన । నింతయేని
తృప్తియనుమాట తనదు మ । దిందలపక
ఉత్తకార్తిశునకమట్లు । చెడదిరుగుట
మొదలుపెట్టెను విటకాండ్రు । ముదమునంద.

ఇట్టిది నేను కన్నులార చూచి యూరకుండఁగలనా ! నాస్నేహితు లెందరో యీవిషయమై నాతో ననేకసారులు ప్రశంసించిరిగాని, వారి మాటల ననేకసారులు త్రోసివేసితిని. ఇట్లుండ నొకసారి యిట్టికృత్యము స్వయముగా నాకంటనే పడినది.

తే. గీ. నాటినుండియు; నెప్పుడా । బోటికడకు
వెళ్ళకుండుటెగాక నా । పేధనైన
నరుగుచుండుట మానితి । నాత్మఁరోసి
యిట్టిపనులెవ్వరికినైన । నిష్టమగునె.

ఇంక వేశ్యలజోలికి బోగూడదని మౌనముపహించితిని.

చంద్ర—(తనలో) ఇదియేమిటి ? ఈయన యిల్లాచెప్పుచున్నాడు. సుబ్బయ్యగారీయన సింహాచలాన్ని చేరదీయడానికి ఒప్పుకున్నాడన్నారే (ప్రకాశముగా) పంతులుగారూ ప్రతివాళ్ళు మీానీ లాచలంమోస్తరుగానే వుంటారనుకొన్నారా యేమిటి ?

వెంక—జగమంతా అల్లాగేవుంటారు అని నేను అనలేనుగాని మొత్తము మీదనీకు కోపం వచ్చినానసరే వేశ్యలలో విశ్వాసంతక్కువ.

చంద్రి—ఎవరో తుచ్ఛపుముండలు విశ్వాసహీనులై యుంటారు. నా సంగతినేను చెప్పకోరాను. తన్నుదా స్తుతించుకొంటే తనుకొన్నట్టే వుంటుందంటారు గాని నాసంగతి తమరు విన్నారో లేదో, నే నీసుబ్బయ్యగారిదగ్గరకు వచ్చి పదిహేను సంవత్సరాలయింది. ఇక్కడకు వచ్చినతరువాత, వెనుక నన్నువుంచుకొన్నవాళ్ళు యెందరో యీలాగు అనేక కార్యములమీద వచ్చి, నాకు కబురులు పంపుతుండేవారు. కాని, నేను వారికిమళ్ళీ సుబ్బయ్యగారి యధీనంలో వున్నాను. తమరాపశంస గలుగజేసుకొనరాదు. వలసినచో దయయుంచి నేని నన్ను జూచిపోండి" అని మరల జవాబులు పంపుచుండేదాన్ని.

వెంక—నీసంగతి నాకు తెలియును. నీకాలిగోరుకైనా తక్కిన వేశ్యలు పోలుతారా!

చంద్రి—ఈవిధంగా నే నాకూతురయిన యీసింహాచలాన్నికూడా తగు పెద్దమనుష్యుల వశముజేసి, కీర్తి సంపాయిద్దామని వున్నదానే గాని తక్కిన వేశ్యల మోస్తరుగా దీనిని త్రిప్పి ధనం సంపాయిద్దామనే వుద్దేశంలేదు. ఇంతకుముందే, తమ విషయమై సుబ్బయ్యగారు నాతో చెప్పినారు. నేను చాలా సంతోషించినాను. మాఅమ్మాయిని తమవశంచేయడానికి అభ్యంతరమేమీ లేదుకాని, సీలాచలానికి మామీదయేమి కోపంవస్తుందోఅని అనుమానం కాస్తవుంది. అయినా అదినాకు పుట్టవలెనా. నేను దానికి పెట్టవలెనా. మాకు కావలసినవల్లా యిస్తూవున్న సుబ్బయ్యగారు వేమోండ్లకూ బాగుండాలి.

వెంక—మీమీద కోపంరావడానికి నీలాచలాన్ని మీరేమిచేసినారు? అది బుద్ధిపూర్వకంగా చేసిందిగాన యీపాపము అదే అనుభవిస్తుంది.

చంద్రి—మంచిమాట చెప్పినారు. మేమయినా మిమ్మల్ని అది తెండీ యిది తెండని ఘుంటఘుంటకు యిబ్బంది పెట్టేవాళ్ళముకాము. మాకింతకావాలి అంతకావాలని మిమ్మడుగము. మీమనస్సును అనుసరించి మాఅమ్మాయి నడుచుకొంటుంది. ఇది అయినా ఆట్టే గడుసుదికాదు.

వెంక—ఈసంగతి అంతా సుబ్బయ్యగారు నాకుచెప్పినారు. ఆయన చెప్పితే నాకు నమ్మకమే తక్కినవిషయములలో ఆయన యెల్లాచెప్పితే అల్లాచేస్తాను. వెధవడబ్బు. దానితో ప్రయోజనమేమున్నది ? విశ్వాసము, నమ్మకము కావాలి.

చంద్రి—నిజమేనండీ మాసింహాచలంకోసం యెంతమందో కబుర్లు పంపించినారు. నవర్సులు యిస్తాము రెండునవర్సులు యిస్తాము అనేవారు. ఏమయినా సరే యెవ్వరో ఒకరిని నమ్మేటట్లు యీ అమ్మాయిని చేయాలిగాని, యీప్రకారంగా ధనంకోసం కనబడ్డవారితో పంపనని చెప్పేసేదాన్ని.

వెంక—ఇది నీతిగలవాళ్ళకు లక్షణము. నీలాచలందగ్గిరయిల్లాటివి పనికిరావు.

చంద్రి—అస్తమానం ఆసంగతి యెందులకులెండి. అయిపోయినదాన్ని గుఱించి విచారించరాదు.

వెంక—వెధవముండకోసం విచారమెందుకు ?

చంద్రి—తమరువుండడం మరలపాపుగదా. మాఅమ్మాయిని అక్కడకు తీసుకొనివెళ్ళతారా యేమిటి? అల్లాగయితే మాకుకాస్త కష్టమే.

వెంక—ఎందుకు వెధవపల్లెటూరు. నేనూ యీవూళ్ళోనే వుంటాను. ఈసంగతి సుబ్బయ్యగారితో చెప్పినాను. నేను యెక్కడవుంటే నేమి? ఏమయినా కష్టపడవలెనుగనుకనా. ఎక్కడవున్నా సంవత్సరము అయేటప్పటికి మనధాన్యగింజలు మనకొస్తాయి.

చంద్రి—అల్లాచెయ్యండి. మాకుసంతోషంగా వుంటుంది. పంతులుగారూ. ఇప్పటికి నామనస్సులోవున్న చింతపోయి సంతోషం కలిగినదండి. మాఅమ్మాయికి యేలాటివారు వస్తారో అని యాలోచిస్తూవున్నందులకు మాపూర్వపుణ్యముకొలది, బ్రాహ్మణులు, రూపవంతులు, భాగ్యవంతులు అయిన మీరు లభించినారు.

వెంక—సరి. సరి. యెంతమాట.

[సుబ్బయ్యప్రవేశము.]

సుబ్బ—పంతులుగారూ! ఎండగావుందికాస్సేపుపడుకోకపోయినారా.

వెంక—ఇప్పుడేంపడకండి.

సుబ్బ—అల్లాగయితే కొట్టుదగ్గిరకు వెళ్ళుదామా యేమిటి?

వెంక—మీయిష్టం యెక్కడకురమ్మంటే అక్కడకువస్తాను. అభ్యంతరం యేమీలేదు.

చంద్రి—ఎందుకు? ఆయన్నుకూడా శ్రమపెట్టుతారు.

సుబ్బ—అరిగిపోతారా యేమిటి? అప్పుడే అల్లుడుపక్షము అవలంబించినావు.

వెంక—సుబ్బయ్యగారూ మీరు మాపెద్దవాళ్ళండి. రండిపోదాము.

చంద్రి—పంతులుగారూ రాత్రిపడకకు యిక్కడికి దయచేయిండి.

సుబ్బ—పంతులుగారు యిక్కడికిరాక మరెక్కడకు వెళ్ళుతారు? బ్రాహ్మణులు అయిపోయినారు గాని లేకపోతే మావాళ్ళయితే ఇంకోచోటికి వెళ్ళనిస్తారా.

సుబ్బ—(పక్కకు చూచి) ఎవడురా అప్పుడూ గుఱ్ఱపుబండి కట్టుమని చెప్పు. వెంకటస్వామయ్యగారూ దయచేం.

(నిష్క్రమించుచున్నారు.)



రంగము—సింహాచలము మందిరములో

[వెంకటస్వామయ్య ప్రవేశము.]

వెంక—ఆహా! నిజంగా యీసింహాచలము నాపూర్వపుణ్యముకొలది సంప్రాప్తించిందిగాని సామాన్యంగా లభించేదికాదు.

తే. గీ. దేవలోకాన రంభాది ॥ దివ్యసతులు
గలసియుండిరటంచును ॥ వింటిగాని
వనిత కాలిగోరునకైన ॥ వారుబోల
రంచు మానసంబందునే ॥ నెంచువాడ.

దీనికోసం యెంతోమంది వాకిలిముందు జవానులకుమల్లే పడికాపులు గాశారట గాని వాళ్ళందరిని తృణీకరించివేసింది. నిజంగా నావిషయములో పెళ్ళితో చెప్పడంలో సుబ్బయ్యగారు చాలా శ్రమపడినారు. ఆయనమూలముననే నేను దీనిజేబట్టు భాగ్యం కలిగింది. దీని సౌందర్యం తలచుకొంటే నావళ్ళు ఝల్లుమంటుంది. దీని మొగము పూర్ణచంద్రునికివంకలుపెట్టుతుంది. కన్నులు పద్మాలనుయెక్కిరిస్తూన్నాయి తిలపుష్పం యీమెనాసముతో సరిగాదు. ఆమన్మధుండు అమృతం పుంచి నిర్మించిన దొప్పలతీరున చెవులున్నాయి. ఈమెచేతులు మృణాళములంతటి పల్లవములు. బంధూకపుష్పం మోస్తరుగా మోవియుంటుంది. మల్లెపువ్వులతీరున పల్వరస అమరింది. ఆహా! యువకులయొక్క కామాంధకారం వదలించేసెయ్యడానికి వెన్నెలమోస్తరుగా వుండే దీనినవ్వేచాలింది. ఈకాంతయొక్క ప్రతియవయవము నెత్తిక్కా నివర్ణించుదామంటే ఒక్కొక్క సంవత్సరముపట్టుతుంది. ఇదంతాయెం

మకు. చిత్రకారకుడయిన రవివర్మ దీనిని ఒకసారి చూచినాడంటే దీనిబొమ్మగూడ వేసి ప్రతివారికి అందుబాటుగా వుండేటట్టు "సేలు" లో పెట్టుతాడు. ఆతడువ్రాసిన శకుంతలబొమ్మయినా యేమయినా యీసింహాచలానికి సరివస్తుందేమోఅని చూచినాను గాని యెక్కడా అందలేదు. (ఎదుటచూచి) అదిగో! సింహాచలం వస్తూవుంది. ఏమి నడక! ఏమిరూపు. ఏమిహొయలు. ఏమిహొయ్యా! ప్రపంచకాన్ని దీనిని భగవంతుడు ఏమహారాజునకో భార్యగాజేసి మహారాణియని పిలువ బడుచు రాణివాసమునందు వుంచుటకుబదులుగా యిల్లాం వేశ్యకులంలో బుట్టించినాడు. అన్నన్నా, నేను పొఱబడ్డాను. దీనికి రాణివాసముద్రా రికితే బాగావుంటుందని అన్నాను. వల్లకాటిరాణివాసము. రాణివాస స్త్రీలకు యేమిపేరుమిగిలింది. పేరుగొప్ప వూరుదిబ్బ. రాణీలమను పైకిపేరేగాని వ్యాపారాలుచూస్తే యికచెప్పనా. లోపలవంటచేసేవా ళ్ళు, బట్టలుప్రతికే చాకలివాళ్ళు వాళ్ళకుప్రియకాండ్రు.

[సింహాచలము ప్రవేశించును.]

సింహా—(తనలో) ఈబ్రాహ్మణుడు నామోహంలో పడిపోయినాడు. ప్రపంచకంబున నన్నుమించినది యీజగంబున లేదనివ్రన్నాడు. ఎక్కడయినా యిల్లాంటివాళ్ళ పాపు బోగమువాళ్ళకు దొరికి తేనే వాళ్ళదరిద్రము పోవుట ఆసీలాచలం నిష్కారణంగా యీయన ప్రాపకం చెడకొట్టుకున్నది. ఆయేడుపేదో రహ స్యంగా యేడవరాదూ. అంత ఈయన కంటపడేటట్టే చెయ్యా లా. చెయ్యనివారెవరు? నేను చెయ్యడములేదూ. గుట్టు యే మయినా బయటికివస్తూవుందా. ఫిడేలువాయించే శ్రీనివాసు లు నాకుగూడ ప్రియుడుగా లేడూ. ఆసంగతి ఈయనచూస్తు న్నాడా. ఇంకా ఈయన మర్లపాడు వెళ్ళుతూవున్నప్పుడు యెంతమంది వస్తూపోతూ వుంటారు. (ఇంచుక యూరకుండి)

మాఅమ్మ నిన్న పిలిచి ఈయనను నెమ్మదిగా లాలనచేసి, మేత కట్టించే మార్గము యేదయినా ఆలోచించమని చెప్పింది యిప్పుడెల్లాగయినా పదార్లు యెత్తులువేసి ఈయనను అందుకువచ్చేటట్టు చేస్తాను. బోగంజన్మ యెత్తినతరువాత విటకానిని బోనిలో వేయకపోతే నాజన్మమెందుకు? (వెంకటాద్రియయ్యను సమీపించును.)

వెంక — (చూచి) ఏదేదీ! నావలపుల భరిణె, నాభాగ్యములపంట, నానోములమూట, నాధనాలకుప్ప, నాపుణ్యములపుంజము వచ్చిందా! నేనువచ్చి చాలాసేపయింది సుమా. నీకోసం కనిపెట్టుకొని వున్నాను.

సింహా — మీరువచ్చినారని దాసీది చెప్పింది; కాని నేను తలకునీళ్ళుపోసుకుంటూవున్నాను. అందుచేత ఆలస్యమైనది. నన్ను క్షమించాలి

వెంక — ఎంతమాటన్నావు. నిన్ను నేను క్షమించవలెనా. ఇంతమాత్రానికే! నీవు ఏమి చెయ్యరానిపని చేశావు?

సింహా — చెయ్యరానిపని యేమీ చెయ్యలేదుగాని పెద్దమనుష్యులు మీరువచ్చి కనిపెట్టుకున్నారు. మీహృదయంలో వేరుభావంగా ఆలోచించరని నాకు తెలుసును.

వెంక — చెప్పవు యింకా, తలంటుకొన్నావు. అందుకనే జారుముడివేసినావు. ముంగురులుకూడ రేగియున్నవి.

తే. గీ. వనితసౌందర్య మీక్షింప । వలెనటన్న
అప్పుడే జలకంబాడి । అరముడివిడి
ముంగురుల్ రేగి; యున్నప్డె । ముగుదజూచి
ముదమునందంగవలయును । పురుషుడతివ.

సింహా — చాలులెండి. మీమాటలకేమి. మీరెప్పుడూ యిల్లాగ అంటూనే వుంటారు.

వెంక—నామాట అబద్ధమా ?

సింహా—మీదగ్గిర యెవ్వరు మాట్లాడగలరు ?

వెంక—సరేగాని, నాకిప్పుడొక దానిమీద మనస్సుపోయింది. ఆకార్యం జేసి నన్ను సంతోషపెట్టుతావా లేదా ?

సింహా—అదేమిటో చెప్పండి.

వెంక—మరేమీ లేదు. నీవు కష్టపడవలసినది యేమీ లేదు. నాకు యిప్పుడు నీసంగీతం వినాలని మనస్సుపోయింది.

సింహా—ఇప్పుడేమిటి యెదీ కానివేళ. రాత్రి పాడుతాను లెండి.

వెంక—అందుకనే నాకు కోపంవస్తుంది. మనిషికి రెండు రోగాలట. కూర్చోమంటే వెళ్ళుతాననడం. కాస్తపాడమంటే, నాచేతకాదనడమో లేక ఆనకపాడుతాననడమో. సింహాచలమూ! నాకోరిక నీవు తీర్చకపోతే యెవ్వరుతీరుస్తారు? నీవు సంగీతంలో మంచి విద్యావంతురాలవుకదా. అందుచేత నేను సరదాపడి పాడమంటే ఆనక యేమిటి? రాత్రియేమిటి? పాడడానికి యెప్పుడయితేనేమి? నాసరదా తీర్చు.

సింహా—నేనందుకోసం అనలేదు. రాత్రి తీరుబడిగావుంటాముగదా అని అన్నాను. మీచిత్తం యిప్పుడు పాడమంటే యిప్పుడేపాడుతాను

వెంక—మనకు యెప్పుడూ తీరుబడే. నీకు వంటపనిగాని యింటిపనిగాని లేదుకదా. నాకుయింకోవుద్యోగం లేదు. నేను యెప్పుడూ నీయెదుటవుండడమే నాకు గొప్పవుద్యోగము. మళ్ళీ బహుశః రాత్రి నేను మదరాసు వెళ్ళుతానేమో. కొద్దిగా అక్కడ పనివుంది. వెళ్ళుదామని అనుకొంటూవున్నాను. ఇప్పుడేపాడు. హార్మోనీ నేశ్రుతివేస్తాను. (హార్మోని శ్రుతివేయును.)

సింహా—మీరు పట్టినపట్టు వదలరండి. కానియ్యండి, మీకుయేరకం యిష్టం. జావళీలా, కృతులా, తరంగాలా, అష్టపదులా.

వెంక — వెధవజావళీలు. మేళాల్లోపాడేవేనా. దిక్కుమాలినవివద్దు. పాడుతూవుంటే సాహిత్యంకనపడాలి, పదిసంగతులూపడాలి. వచ్చేసంవత్సరానికి నీవు గానసభలోనికి యెక్కాలి.

సింహా — అయితే నాకువచ్చినవి పాడుతాను ఒక తరంగము ముందు పాడుతాను.

వెంక — పాడు పాడు. చాలాబాగుంటుంది.

సింహా — (పాడుచున్నది.)

శంకరాభరణం — ఆటతాళం.

శ్రీవాసుదేవప్రభో పాలయమాం॥ శ్రీ॥
సకలహితకర-సరసగుణగణ-నిగమసరసిజ-జయతరసఘన
విగతభవభయ-వినుతసురవర-గగనసువిమల-గరుడవిహారణ॥ శ్రీ॥
సరసిజోదరచరణవిలసిత-సరసనూపురసాధుహితకర-తరళకుం
డలతాండవానన-మురరిపోకిల-మోహనాభవ॥ శ్రీ॥
నిరుపమధ్వని-నికరపావన-మురళికారవమోహితాకిల-
సురవధూగణసుందరానన-కరివరానన-కాంచనాంబర॥ శ్రీ॥
దివ్యమంగళగోపవేష-దీనపాలనపీతదోష-నవ్యతరనవనీతరసిక
వరసఖాసఖనిఖిలజనక॥ శ్రీ॥
దేవకీవసుదేవతనయ-దేవరాజవిరచితవినయ-చేవనారాయణా
నందతీర్థవిరచితదివ్యగీత॥ శ్రీ॥

వెంక — శంకరాభరణంలావుంది. మామంచినిండైనరాగం. ఇల్లాచెప్పిన మాటవిని పాడితే నిన్ను ముద్దుపెట్టుకోబుద్ధిపేస్తుంది. ఏదీ స్పృంగారసంబంధమైనది స్వరముతోగూడా ఒక్కటిపాడు. సంగీతవిద్యాదర్పణమంతా నీకు కంఠోపాఠమేకదా. జిలహూరిమీదకానియ్యి.

సింహా___

బిలహరి___ఆటతాళం.

ప॥ సా,రి–గా పా–ధా సానిధా–పాధప–మగరిస–సనిధసా॥ సారి॥
రా,ర–వేణు,–గోపా బాలా–రాజిత–సద్గుణ–జయశీలా॥ రార॥
1. సా,రిగా పా–మా,గ పా ధా–రీ,సనీదా–పా,మగారీ॥ సారి॥
సా,రసాటో–నే,ర మేమీ–మా,రు బాధా–కో,ర్వ లేరా॥ రార॥
2. సా,రిగగ్గా,,–,,రిగ–పాప్ప–పప్ప–ప్పా,,–,,ధప
నం,దగోపాలా,,–,, నెవ నెందుబోజా–లా,,–,, నిజ
సాస్ససస్సా–గరిసని–నిధపా–పధపమ–గగరీ–గపమగ–రిసరిగ ॥సారి॥
మిందురారా–సదమతి–మదిత్రోముదమల–రగనా కెవరుగగదియర॥
3. పపపా–రిరిరీ–గపమగగా–గపమగ–మగసరి–రిగరిససా,,–
పలుమారు–రునుగా–రవమునని–బిలచిన–బలుకవు–సలుగకురా,,–
రిసనిధసా,,–మగరిగపా–ధపదరిసా–రిసనిధ–పమగ॥ సారి॥
కరివరదా,,–మరిమరినా–యధరముగోరి–లరకని–కరముగ॥ రార॥
4. పా,,–మగరిగ–ధా,,–మగరిగ–సా–మగరిగ–పప్పప్పా,–
రా,,–నగధర–రా,,–మురహర–రా,,–భవహర–రావేరా,,–
గా,,–రీసనిధ–రీ,,–రిసనిధసా–,,–రసనిద–సస్సస్సా,,–
ఈ,,–మగువను–ఈ–,,లలనను–ఈ,,–సొగసిని–చేకోరా,,–
గారిస–రిరిరిరి,,–రీసని–ద్దదా–పామగ–గగ్గ–
కోరిక–లింపొందా,,–డెందము–నీయందా–జేరెను–నీ జెం
గ్గా,,–సరిగధసా,,–రిసరిగ–సా,,–గరిసని–ధపమగ–రిసరిగ॥ సారి॥
దా,,–మరువకు రా–కరముల–చే,,–మరిమరి–నినుశర–ణనెదర॥ రా॥

వెంక___ఆహా! యేమిసంగీతము. మొగము యెదుట అనకూడదుగాని నారదుడు, తుంబురుడు,నీ యెదుట పనికిరారని చెప్పవలసివచ్చినపుడు,భవాని,గోదావరి,ధనకోటి, నాగరత్నం వీరిని యెత్తడమెంచుదు

సీ. బ్రహ్మకుమారుడు వీ । ణారవంబిదియంచు
మానసంబునకు వి । భ్రాంతిదోప
సంగీతరసమిట్లు । పొంగిపొరలుచుఁ బ్ర
వాహమైనట్లు భా । వమునదోఁప
భువిని శృంగారమే । యవతారమెత్తెనా
ధరణినన్నట్లు న । చ్చెరువుగాఁగ
కోకిలారవమును । బ్రాకటంబుగ గేలి
యొనరించెనంచును । మనసుకఱఁగ
తే. గీ. సరసమైనట్టి నీగళ । స్వరమునెత్తి
పాట హాయిగాఁ బాడి నా । భావమునకు
నుచిత ముదంబుఁ గూర్చితి । వతివమిన్న
నిన్ను వర్ణింపఁ దరమా నె । నిక్కముగను.

నేను యిన్నాళ్ళుబట్టి యేమోఅనుకొన్నాను. గుమ్మ్ఖులాసాచేశావే. చూడు సింహాచలమూ! నీదగ్గిరవుంటే వేరేసింహాచల యాత్రకు వెళ్ళ నక్కరలేదు. ఈరోజునుంచి నీవు ఒక యేర్పాటుచెయ్యాలి ప్రతిరోజు సాయంత్రం ఒకఘంటనాకు నీగానము వినిపించుతూ వుండాలి.

సింహా—ఇంతేకదా! ఆమాత్రము మీకోరిక తీర్చలేనాయేమిటి? కాని సంగీతం పాడడానికి మనస్సు ఖులాసాగావుంటే మరీబాగా వుంటుంది.

శంక—ఏమిా! నీమనస్సు యెప్పుడూ ఖులాసాగానే వుంటుందిగదా. చింతయేమున్నది? నీకేసంసారపుచింతలేదు. డబ్బుచింతలేదు. సమస్తభారము నావీపుమీద నేను పెట్టుకున్నానుగదా.

సింహా—ఏమికావలస్తే అవియిస్తున్నారు. అందుకుసందేహమేమిాలే దుగాని నామనస్సులో సంతోషం యెల్లాప్రివేళ పెట్టాను. నాకు మనస్సులో ఒకదానివిషయమై చింతయున్నది. అదితీరడం

మెల్లోగునాఅని బెంగపెట్టుకొనివున్నాను. మానాయినగారయిన సుబ్బయ్యగారినికూడా మాఅమ్మ ఈవిషయమైచాలాసారులుఅ సిగిందికానియిప్పుడెక్కడఆపనిచెయ్యాడం డబ్బుఖర్చుఅన్నారు.

వెంక — అదియేమిటో కాస్తనాచెవిని బడవెయ్యకూడదూ. ఆకోరిక నీకు నేను తీరుస్తానేమో.

సింహా — ఏమిటో మాట లంటారుగాని తీరా విన్నతరువాత, యిది యేమిటోరి బాబూ అస్తమానము యీసింహాచలము దేనికో దానికి యిబ్బంది పెడ్తూనే వుంటుంది అని అనుకొంటారు.

వెంక — సఖీ! నీవు అల్లాచెప్పడం ధర్మంగావుందా! నేన నీకుయెప్పు డేది అడుగు తేలదియివ్వడం లేదూ. అడగనివికూడా నాకుమోజుపుట్టి కొన్ని తేలేదూ. వెనుక నేను చెన్నపట్టణంవెళ్ళినప్పుడు టాకరు అండు సన్సులో రతనాలుచెక్కిన గుళ్ళకంటియున్నూ, పి. ఆర్. అండు సన్సులో మణులుతాపిన చేతికంకణమున్నూ, రెండూ కలసియెంతఖరీదైనవి రూ 14000 వేలవలేదూ. అవి తెచ్చియి వ్వలేదూ. అవి నువ్వుతెమ్మంటేనే తెచ్చానా. కాబట్టి నీవుమన స్సులో సందేహించక నీకువున్న కోరికయేదో చెప్పు. సుబ్బయ్య గారు తీర్చేదియేమిటి? నాశక్తికిమించనిదైతే నేనే ప్రయత్నం చేస్తాను. ప్రపంచకంలో నీకన్న నాకుమించినవస్తువు యేమీ లేదు. త్వరగా చెప్పు.

సింహా — అది డబ్బుతోపని. మీకుశ్రమయెందుకియ్యానాయని సందే హిస్తున్నాను.

వెంక — డబ్బుతో పనేగదా. అయితేయిబ్బందిలేదు. వెధవడబ్బు. మన ముపచ్చేటప్పుడు పట్టుకొనివచ్చినాముగనుకనా చచ్చేటప్పుడు పట్టుకొనివెళ్ళడానికి. డబ్బుఖర్చుఅవుతుందంటే నేనుఏమాత్రం బెంగపెట్టుకొనేవాడనుగాను కాబట్టి నువ్వు చెప్పవచ్చును.

సింహా— ఏమీ లేదుగాని చాలారోజులనుంచి స్వంతయిల్లు వుంటే బాగుంటుందని కోరికపుట్టింది. యీకోరిక నాకేగాక మాఅమ్మకు కూడా పుట్టింది. పుట్టితేనేమిలాభము? కట్టించేవారెవరని ఆఖరకు మాఅమ్మసాహసంజేసి, సుబ్బయ్యగారిని యీవిషయంలో కదిపితే ఆసంగతియిప్పుడెందుకు మరొక్కప్పుడు చూతామన్నారు. పోనియ్యండి. ఏమైతేనేమి,మాఅమ్మవస్త్రులు నావస్త్రులు మీరుఅమ్మివేసి ఆసొమ్ముతో ఒకమంచియిల్లన్నా కట్టించిపెట్టండి. ఈసాయమైనా మీరుచేయండి. వస్త్రులు అమ్ముతామంటే సుబ్బయ్యగారు వప్పుకోరు.

వెం— సింహాచలముమా! నీమాటలు మహాతమాషాగా వున్నాయి. మీవస్త్రులు అమ్మి నేనుయిల్లుకట్టించవలెనా! ఆలాచేస్తే నేనుచేసేది ఏముంది? నామగతనమేముంది? చేతనైతే కట్టించాలి లేకపోతే ఒకదండంపెట్టి వూరుకోవాలి, అంతేకాని వస్త్రులు అమ్మేవాడనుగాను.

సింహా— యిల్లాగయితే మాకోరిక యెల్లాతీరుతుంది? ఎన్నాళ్ళు యీ అద్దెకొంపలోవుంటాము. వెంకటాద్రియయ్యగారు వుంచుకున్న సింహాచలం యీపాడుగుడిసెలోవుంది అంటే నాకు చిన్నతనంగావుండి. మళ్ళీ సుబ్బయ్యగారు చూడబోతే లక్షాధికారి. ఒక ఇల్లన్నా యింతవఱకు కట్టించలేదు. యీపాడుకొంపలో ఇక మీరు వస్తూవుంటే మాకే చాలా కష్టంగావుంది.

వెంకో— మీ కన్నమాటేమిటి? నాకూఅల్లాగేయున్నది. ఈవిషయంలో నీవిప్పుడంటేనాతో చెప్పినావుగాని నేనిదివరలో రెండుమూడుసారులు సుబ్బయ్యగారితో మాట్లాడినాను కాని ఆయన యెందుచేతనోగాని అశ్రద్ధచేసినాడు. దానిమీదట నేను అస్తమానంకదుపుతూవుంటే బాగావుండదన్నా. నేనేయీపనిపూర్తిగా చేస్తే

బాగావుంటుందని యనుకొన్నాను. కాని నీవిప్పుడు అడగడం మంచిదే. ఇంక నేను యేమాత్రం అశ్రద్ధచేయకుండా రేపటి నుంచే మనయిల్లుకట్టించే ప్రయత్నంచేస్తాను. నేను యిల్లు మీ కోసంకట్టించినానంటే మనవూళ్లో యెక్కడాలేని పద్ధతిగావుండాలి. మేడకుముందు "లాను" రావాలి. అదివరకమోస్తరు రాజమందిరంలా వుండాలి. లోపల అధమపక్షము యిరువై పెద్దగదులు వుండాలి. బ్రహ్మాండమైనహాలు. అంతా రాతిమీద పని చేయించాలి. గోడలన్నీ సిమెంటుతో పనిచేయించాలి. ఇన్నిమాటలతో పనియేమున్నది? ఈ వూరు మేడలన్నిటిలోను అగ్రస్థానము వహించాలి.

సింహా—(తనలో) ఈయన నెమ్మదిగా నామాటను వప్పుకుంటూవున్నాడు. బాగా ఈయనకు నామీద అనురాగం వున్నప్పుడే యీయనను లోక్షింగా వేయాలి మేడకట్టించేదాకా ఆన్నా! నా రహస్యసంచారము ఈయనకు తెలియకుండా చేసుకోవాలి. (ప్రకాశముగా) పంతులుగారూ! నాకీమాటలవల్ల [illegible] మీరు మేడకట్టించేటట్టు వున్నారు. ఇవన్నీ మాటలలో క్రియలో కనుపరుస్తారో తెలియకున్నది. అయినా చూడాలి [illegible]. మీరు సాధారణంగా అబద్ధమాడే వారుకారని నాకు తెలుసును గాని వక్కాణించుటమాత్రము సందేహిస్తున్నాను. ఇదివరకే మీ బంధువులు మీవారుఅంతా చంద్రవదనకూతురును వుంచుకొని ఆస్తిఅంతా పాడుచేస్తున్నాడని వదంతులు వేయసాగినారు. ఇల్లావుంటే మేడకట్టించేటప్పుడు మిమ్మల్ని యెవ్వరయినా అటుకంపెట్టారేమో అని సందేహంగావుంది. అయిన మీరు ఒకరిని లక్ష్యపెట్టేవారు గారులెండి?

వెంక—సింహాచలం! ఈలాటిమాటలతో నేమిపనియుంది? అయినా

ఈకాలం ఎవరిసొమ్ము వారు తిన్నా లోకులకుయేమనుకే. కాబట్టి కావలసినవస్తు అనగా డబ్బున్నగిరాలు నేనుసప్లయిచేస్తాను. లోపాయికారీని నేనువుండి సుబ్బయ్యగారిచేత యీపనిచేయిస్తా ను. నాపేరు బైటకురాకుండా వుంటుంది.

సింహా—(తనలో) సుబ్బయ్యగారంటే పైకి పెద్దమనిషిమల్లే వుంటాడు గాని దేవాంతకపుప్రాహాలు. ఈయన మేడకట్టించేవిషయమంతా ఆయనమీదపెట్టాలనుకొంటున్నాడు. ఇదేసమయమని తలచి సుబ్బయ్యగారు ఈమేడకాస్తా ఆయనటోపీవేయడుగదా! కానీ పరవాలేదు. నాఅమ్మవుందిగదా సుబ్బయ్యగారిని బుట్టలోపె ట్టడానికి. ఇంతేగాని మేడతయారు అయితే చూచుకోవచ్చును. (ప్రకాశముగా) పంతులుగారూ! మీమాటలు నిజమేనా?

వెంక—ఇంకా సందేహపడతావు యెందుకు? ఇందుకు నేను తిరిగితే మాతృద్రోహముచేసినట్టే. మేడకట్టించడానికి రూ 40000 ల కన్న యెక్కువ అవదుగదా. రేపేగణపతిలాల్ దగ్గిరకు వెళ్ళి దస్తువిషయమైమాట్లాడిపైసలుచేస్తాను. అతనికి తిరిగీవకసంవత్స రంలో యిచ్చివేస్తాను. ఈసంగతిరేపు తెముల్చుకొని రాజమం డ్రికి వెళ్ళి కలపవిషయమై మాట్లాడి కావలసినది పంపమని ఆర్డరుయిచ్చి బజానాయిచ్చివస్తాను.

సింహా—ఏమోమీరు యేంయేర్పాటుచేస్తారో ఈవిషయంలో నామ ద్దు చెల్లించాలి. మాకామేడ యేమీ వ్రాసి యివ్వవద్దులెండి అందులో మేమువుండకేచాలు. వెంకటప్రియయ్యగారు వుంచిన సాని మేడఅంటే మీకేఖ్యాతి.

వెంక—నీవాలాంటిమాటలనవద్దు. వెధవమేడ. నీదైతేనాదికాదా నా దైతే నీదికాదా. డబ్బువిషయంలోగాని మరేవిషయంలోగాని నీపట్ల నేను వెనుకంజవేసే వాడినిగాను. నాప్రాణంయిమ్మన్నన్న

ఒకవేళనన్ను వదలివేస్తే ఏ నుయ్యో గొయ్యో చూచు
కొంటాను.

వెంక—అన్నా! ఎంతమాటచెప్పినావు. నాకంఠంలో ప్రాణంవున్నంత వట్టుకు నిన్ను వదలిపెట్టను. నీవుఆవిషయమై సందేహించవద్దు (ఇంచుక యూరకుండి) ఇప్పుడీ అనవసరమైన మాటలన్నీయెం దుకు. నేను త్వరగా భోంచేసి, సుబ్బయ్యగారిని వెంటబె ట్టుకొని గణపతిలాలుదగ్గరకు దస్తువిషయమై మాట్లాడడానికి వెళ్ళవలెను. రా—

(నిష్క్రమింతురు)



రంగము:—[గణపతిలాలుకొట్టు—ప్రవేశము:—
సుబ్బయ్య—వెంకట్రామయ్య.]

వెంక—సుబ్బయ్యగారూ! ఈవ్యాపారంలో నేనుమిమ్మల్ని నమ్ముకొని దిగుతున్నాను. తీరామీరు నట్టేటులో పుట్టి ముంచకూడదు.

సుబ్బ—దేనివిషయమై మీరు యిల్లాచెప్పుతున్నారో యూహించలే కుండా వున్నాను.

వెంక—మీరేంబెంగ పెట్టుకోనద్దు. డబ్బువిషయమై మిమ్మల్ని యేమీ తొందరపెట్టను. మీరేమీ అశ్రద్ధచేయవద్దు. మీరల్లాప్రాంతికే పైగావుంటేచాలు. కట్టించడంవగైరా బందోబస్తులన్నీ మీరు చేయాలి. కాస్త పెద్దలు. మాకంటె వ్యవహారాలు బాగా తె లిసివున్నవారు. నేనీమేడకట్టిస్తున్నట్టు యెవ్వరికీ తెలియకూడ దు. మీస్వంతపని మోస్తరుగా చేయించాలి.

సుబ్బ—ఎందుకు పంతులూ. నీవుచూస్తావుగదా. నీవుకట్టిస్తున్నట్టు రెండోకంటివాడికి తెలియనిస్తానేమో మాటలుచెప్పితే యేం ప్రయోజనంవుంది.

వెంక—ఇదేంఖర్మం. మనంవచ్చిచాలాసేపయింది. మార్వాడీయింకా లోపలనుంచి యివతలకు రాడే. (నౌఖరునిచూచి) ఏమిరా మీసేటుగారు లోపల యేంచేస్తున్నారేమిటి.

నౌఖ—బాబయ్యా! ఇప్పుడే నీల్లోసుకొని రొట్టెతింటున్నారు. వస్తారు. అయిపోవచ్చింది. కూంతసేపు కూకోండి?

వెంక—కాస్తనువ్వువెళ్ళి చెప్పు.

నౌఖ—చిత్తము. (నిష్క్రమించును.)

[గణపతిలాల్ ప్రవేశము.]

గణ—ఓహో! పంతుల్ సాబ్. షావుకారుసాబ్ ఆయే. రామ్ రామ్. ఇదర్ బైటో.

వెంక—రామ్. రామ్. పరవాలేదు. యిక్కడకూచ్చుందాము. ఎక్కడై యితే నేమివుంది.

సుబ్బ—మీయిల్లుమాకు కొత్తా యేమిటి?

గణ—మీరు నిండాపనియేదో వుండివచ్చినట్లు కనపడుతుంది.

వెంక—మాతో మీకు, మీతోమాకూ వ్యవహారాలు లేకుండా వుంటాయా! పెద్దవ్యవహారంమీదనే వచ్చినాము.

గణ—ఏమిటి? అవ్యవహారం.

సుబ్బ—వెంకట్రామయ్యగారూ! మీరు సందేహించనక్కరలేదు. గణపతిలాల్ గారు మనవారే. మనము అర్ధరాత్రివచ్చినా సర్దుబు చేసి పంపేవారే. చెప్పండి.

వెంక—మీదగ్గరకు మేమెందుకువచ్చినాము? మీకుమాత్రం తెలియదా యేమిటి? కొద్దిగా దస్తుకావాలి.

గణ—ఏమాత్రం కావాలియేమిటి? రెండువేలా మూడువేలా.

వెంక—అబ్బే! సలభై వేలు కావాలి.

గణ—(తనలో) పూరావడ్డీ దొబ్బడానికి యిదేమంచిసమయం. అంతే దస్తూ యిప్పుడే కావాలా! పదిపదిహేను రోజులు పోయినతరువాత యియ్యకూడదూ! మరేంలేదుగాని దస్తుకు మహానిక్కచ్చిగావుంది. లడాయి గిరాకీగావుంది. నిన్ననేనే 100 కి 0-14-0 లు వడ్డీచేసి ఎన్మిదివేలుపట్టుకొని వచ్చినాను.

వెంక—మీామాటల కేమిలెండి. ఏదో అప్పటికప్పుడు అవసరంవుండి పట్టుకొనివస్తే పట్రానివచ్చును. మీారేమిచేస్తే మాకది అంతా యెందుకు? యీ వ్యాపారం మీారుమాకు సప్లయిచేసి పంపించాలి.

గణ—వేరే ఆలోచన మారు యేమీాలేదు. డబ్బు తక్కువగావుంది. వ్యాపారం యేమీాసాగడంలేదు. కాసులు వ్యాపారం తగ్గింది. తగ్గడమేమిటి అసలేరావడములేదు. ధర పూరాగా పెరిగిపోయింది. పోనీ అల్లాగేసరుకుఒక్కసారిగానే తెప్పించుదామంటే గిభీలుమని ధరతగ్గితే వ్యాపారం లుకసానా యిస్తుంది. ఈలావుంది. అయినా మీావిషయం ఆలోచిస్తాను లెండి.

వెంక—ఇంకా ఆలోచన యెప్పుడు? మీారుసప్లయి చేయాలనివుంటే యెంతసేపు. మీారు దస్తువిషయంలో యేమీా భయంపడవద్దు దానికి తగినఆస్తి తణఖా వేస్తాను. మనసుబ్బయ్యగారు కూడ సాక్షిసంతకం చేస్తారు. మొత్తము రెండుయేళ్ళల్లో తీర్మానంచేస్తాను. ఏనెలవడ్డీ ఆనెలయిస్తాను. అలాయియ్యకపోతే వడ్డీ అసలులో చేర్చుకొని దానికి కాంపౌండు వడ్డీ యిచ్చుకొంటాను.

గణ—(తనలో) త్రోవలోకివచ్చినాడు. (ప్రకాశముగా) పెద్దమనుషులిలా మీారుఅడుగుతూవుంటే సప్లయిచేయకపోతే యేం బాగావుంటుంది. కాని వడ్డీకాస్తజాస్తి అవుతుందేమో అని చెప్పడానికి సంశయంగావుంది.

తణఖాఆస్తి:—మరలపాడులో వుండుకొన్న యే బీ డి మార్కేషనులు గల 500 యాకరముల పల్లపుభూమిలో ఏ డి మార్కేషనుగల 250 యకరములు రూ 40,000 లకు తణఖా.

ఆన 1907 సం॥ జనేవరి 1 తేదిని బొంబాయికాపురస్తులున్నూ ప్రస్తుతం వాయసపురంలో కాసులువగైరా వ్యాపారంచేసేవారున్నూ అయిన మహారాజశ్రీ గణపతిలాలుగారికి మర్లపాడు గ్రామకాపురస్తులున్నూ జిరాయితీదారున్నూ అయిన వేశ్యాంగనాశ్రీయు దివాణం వెంకట్రామయ్య వ్రాసియిచ్చిన తణఖాదస్తావేజు.

ఈరోజున మీవద్ద నాకు మర్లపాడులోవున్న A B డిమార్కేషనులుగల 500 యకరముల పల్లపుభూమిలోను ఏ డిమార్కేషనుగల 250 యకరముల భూమి మీవద్ద తణఖావుంచి నాస్వాంతఖర్చులు నిమిత్తం 40 వేలరూపాయలు యిందుకువడ్డీ 100కి రు 1-0-0 వా॥ నిర్ణయించుకొని పుచ్చుకోవడమయినది. ఈబాకీ రెండు సంవత్సరముల వాయిదాలో తీర్మానంచేయుటకున్నూ సంవత్సరాంతమందు అయినవడ్డీ 1908 సం॥ జనేవరి 1 తేదిని యిచ్చేటట్టున్నూ అలా యివ్వకపోయినయెడల వడ్డీ అసలులోచేర్చుకొని వడ్డీకి కాంపౌండువడ్డీ కట్టుకొనవచ్చును. సదరు పొలంలో ఫలసాయములలో మీకు సంబంధనిమిత్తంలేదు. ఒకవేళ రెండుసంవత్సరములు అయినప్పటికి నేను మీబాకీయము తీర్చకొని యెడల సదరు ఆస్తిమీద మీరు దావా చేయవచ్చును. ఇందుకు నేనేవిధమయిన అభ్యంతరము పెట్టువాడనుగాను. ఈయాస్తి యింతకు ముందు యెవ్వరికీ తణఖా పెట్టబడి వుండలేదు. యిదినాసమ్మతిని వ్రాసియిచ్చిన తణఖాదస్తావేజు.

గణ—బాగుంది. ఆనక సాపువ్రాయించి రేపు రిజిస్టరుచేయిద్దాము.

లెక్క— రిజిస్ట్రారువారి ఆఫీసులోనే యిచ్చేస్తాను.

వెంక—మంచిది. మేము వెళ్ళివస్తాము. (నిష్క్రమింతురు.)

తే. గీ. తనకుమాత్రకు సౌఖ్యంబు దలఁపకుండ
వయసుమీఱినవారికిఁ బరిణయంబు
జేసి ; ధనముఁ గైకొనఁజూచు చెనటికెట్టి
శిక్ష జేసినఁ బాపంబు చెఁడదిలను.

కన్యావిక్రయం చేసేవారికి రెండుకోఁడలనిండవాత వేసినా పాపము లేదు. ఈలాటిచిన్నపిల్లలను దెచ్చి, ముసలాళ్ళకిస్తే వీళ్లేమి సౌఖ్యంపడతారు. "యౌవనంవాపనంవా" అన్నారు. ఇందుచేతనే "వరల్డులో డిబాచరీ" యెక్కువయిపోయింది. అందుకనే భోగంవాళ్ళు 'సంసారులు బయలుదేరి మానోట్లోకూడా పడకొట్టివేశారని' యేడుస్తున్నారు. పాప సీతామె మొగుడికి ఆరోపడి అనగా అరవయ్యోయేడు దాటుతుంది. ఈవిడ్కి చూడబోతే పదియేడవయేడన్నా లేదు. ఈవిడ యీమధ్య ఆసందులో ఆ 'విడో' "ఓపెన్" చేసిన స్టుడియోలోకి తరచు వెళ్ళివస్తుందని విన్నాను. పెద్దమనుష్యులయినా ఆ స్టుడియోలో అడుగుపెట్టినారంటే యిక మన వశంగాదు. ఆ "విడో" పెద్దపెద్దవాళ్ళకొంపలే తీసింది. మిస్ట్రెస్ సుందరమ్, మిస్ట్రెస్ సత్యాం, మిస్ట్రెస్ సుబ్బన్ ఆర్ ది మెంబర్సు ఆఫ్ దట్ స్టుడియో. ఈవిడకూడా తఱుచు అక్కడకు వెళ్లుతూఉండడముచేత, నాకుకాస్త "డౌటు" గానేవుంది. మంచిబుద్ధులంటే అబ్బవుగాని వెధవబుద్ధులెంతసేపులో అబ్బుతాయి. ఆరునెలలు సహవాసంచేస్తే వారు వీరు అవుతారట. నెమ్మదిగా నేను ఈవిడవ్యాపారంకాస్త కనిపెట్టాలి. ఏమిటో నామైండుకూడా కాస్త ఈవిడ బ్యూటీ అట్రాక్టుచేసింది. అదుగో ఆవిడ యిల్లా వస్తూవుంది. కూడా యింకో "విడో" కూడా వుందే. దీనమ్మాకడుపుకాలా ఈసమయంలో ఈవెధవముండ యెక్కడ పోగయింది. ఎవరోఅనుకొన్నాను. స్టుడియో ప్రొప్రయిటర్ అండ్ మ్యానేజరు అయిన వీరమ్మగారే. కాని ఈవొడ్డున కూర్చొని యేమి మొఱుగనట్లు మొఖంకనపడకుండాటూ యేమిచెప్పుకుంటారో వింటాను.

[వీరమ్మ, నరసమ్మ బిందెలుపుచ్చుకొని ప్రవేశము.]

వీర—ఏం నరసమ్మా! ఇల్లుదగ్గరయినా కనపడడంలేదు. పూర్తిగా మబ్బులో చంద్రుడవు అయిపోయినావు.

నర—ఏమీలేదమ్మా. ఏమిటో! ఆయన రెండు మూడు రోజులనుంచి యెక్కడికీ వెళ్ళడంలేదు. అందుచేత నేనూ యెక్కడికీ కదలడం లేదు.

వీర—పొరుగిళ్ళకు వెళ్ళితే భర్తగారు యేవన్నా అంటారాయేమిటి?

నర—పాపమా మనకు యివన్నీ అక్కరలేదు. ఆయన యింటికివచ్చే టప్పటికి కాస్తవండిపెడితేచాలు. నాఅవస్థమట్టుకు భర్తగారి దగ్గరాకూడా వుంటే ఇకఅడగనా!

వీర—నీకేంఅమ్మా! నీయవస్థకేమివచ్చింది? మొగుడు కావలసినంత సంపాదించి తెస్తాడు. ఇంతకంటె యేమికావాలి?

నర—పిన్నిగారూ. అవును ఏమీతక్కువలేదు. ఎవరిబాధలు యెవరికి తెలుస్తాయి? నాకష్టంలో యెంతచింతవుందో మీకేం తెలుస్తుంది?

వీర—అవునమ్మా. నీవు నిజం చెప్పినావు. అందచందాలకి యేమీలో టులేదుగాని దానికి తగినట్టు యెక్కడోమాత్రం లోటువచ్చింది. యేం చేస్తాము. ఏఘటానికి యేదిప్రాప్తో అదిఅల్లా జరుగుతూ వుంటుంది.

కేశవ—(తనలో) అమ్మా! మాటకొస్తేనా సత్యవముండ! దీనిని నెమ్మదిగా పాచికవేసి, "స్టూడియో" మెంబరుగా చేసుకోవాలని ప్రయత్నం.

నర—ఇప్పుడేమనుకుంటే నూరాలోచిస్తుంది? అయిపోయిందిగదా (విచారించును.)

వీర—విచారించకమ్మా. పిచ్చిదానికమల్లే వున్నావు.

కేశ—"ఫ్యామిలీ గరల్సు"నుపాచిక వేసి చెడగొట్టడానికిదీనిదగ్గిరవున్న శక్తి మరిమొకరిదగ్గిర లేదు.

వీర—చూడు నరసమ్మా! ఆనక భోజనంచేశాక మాయింటికి ఒకసారివస్తావా! నీతో కొన్నిరహస్యాలు మాట్లాడాలి. అది నీకూ లాభం నాకూలాభం.

నర—అదియేమిటో కాస్త యిప్పుడు చెప్పరాదూ!

వీర—ఇప్పుడుచెప్పడానికి వల్లపడదు. అతిరహస్యం. తరువాతచెప్తాను కాదూ. నామాటవిని ఒక్కసారివద్దూ. ఇంతట్లోకే కాళ్ళు అరిగిపోవు.

నర—అల్లాగే వస్తాను.

వీర—ఈమాట యింటికి వెళ్ళినతరువాత మఱచిపోతావా?

నర—మఱచిపోను తప్పకుండావస్తాను. రండి నీళ్ళుముంచుకొని వెళ్ళుదాము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

కేశ—(తనలో) ఈముండ యీనరసమ్మను భోం చేసినతరువాత మధ్యాహ్నం యింటికిరమ్మనమని చెప్పింది. ఏదో బూతాకానీ వేయడానికే. ఎవళ్ళో ఒకళ్ళకి దీనిని అతకపెట్టుతుంది. "నాకూ లాభంవుంది నీకూ లాభంవుంది. అని యిది చెప్పినమాటల్లోనే తెలిసింది. కానీ; నాకున్నూ, సుబ్బమ్మకున్నూ స్నేహంవుండిగదా. అది మధ్యాహ్నపువేళ వీరమ్మయింటికివెళ్ళి కాస్సేపు కూర్చోడం పేకాడుకోవడం అలవాటువుంది. కాబట్టి ఈవిషయంలో లోతు ఆ సుబ్బమ్మద్వారా తీస్తాను.

(నిష్క్రమించును.)



సుంద——మన అఫీసుకు వ్యాపారావిడ అంజనీబాయమ్మ ఒక్కతే తక్కువయింది.

[నరసమ్మ ప్రవేశము.]

వీర——(నరసమ్మను చూచి) నరసమ్మా! మొత్తానికి అన్నమాట నెగ్గించుకొన్నావు. వస్తానన్నావు వచ్చినావు.

నర——నేనాడేది ఒకటి చేసేది ఒకటికాదు.

వీర——(నరసమ్మచూడకుండా తక్కిన ముగ్గురిని అవతలకు వెళ్ళమని కన్ను గీటుచున్నది.

సుబ్బ——సుందరమూ, సత్యమూ! రండి ఇంటికాడపనివుంది. మళ్ళీ అయినా వద్దాము. (వెళ్ళబోవుచున్నారు.)

నర——ఇదేమిటి నేనువస్తే మీరంతా వెళ్ళుతున్నారు.

సుబ్బ——కొద్దిగాపనివుంది. కాళ్ళు నొప్పిపెట్టుతున్నాయి కూచుని కూచుని.

వీర——వాళ్ళు మళ్ళీవస్తారులే, నువ్వురా యిల్లాకూర్చో.

నర——(కూర్చుండును).

వీర——ఈవాళ యేమి వండినావు?

నర——రోజూఏమివంటనమ్మా. కూరలుబజారులోమండిపోవుచున్నాయి. గుమ్మడికాయముక్క యెక్కడనుంచోమావారుపట్టుకొనివస్తే పులుసుపెట్టినాను, పప్పువండినాను, ఊరగాయ. ఏమిటో, ఏది తిన్నా కడుపు నిండిపోతుంది.

వీర——నేనూ కూరగాయలుకొనడానికి మహాయిబ్బందిపడుతున్నాను. గాజులుతొడిగించుకొని చాలారోజు లయినట్లున్నదే. గంట గంటకు తొడిగించుకోవడంకన్న, రెండుమూడుపర్సులుయిచ్చి కట్టించుకుంటే యెప్పుడూ నిలచివుంటాయి.

నర—ఎల్లావస్తాయి అమ్మా! తక్కువనోములునోచుకొని ఎక్కువఫలములు రమ్మంటే వస్తాయా.

హీర—అవును నిజమే. పాపమెన్నోసార్లు ఆకోమట్లబ్బాయి నీవిషయమై చాలా విచారించుతూ నాతో చెప్పుతూవుంటాడు.

నర—ఏకోమట్లబ్బాయి.

హీర—మీాఆయన పురాణంచెప్పుతూవుంటాడే. ఆయింటియజమానుని కొడుకే. పాపముచాలామంచివాడు ఈపనినీచేత కావాలిఅంటే చేసితీరుతాడు. డబ్బులేని నిరుపేదలనుచూస్తే అతనికి మహా జాలివేస్తుంది. అన్నిగుణాలు మంచివేకాని అతనిదగ్గిర ఒక్కదుర్గుణంమాత్రంవుంది.

నర—ఆ దుర్గుణం యేమిటి?

హీర—కొద్దిగా తిరుగుబోతు. అయితేనేమి! నిన్ను నమ్మినాను అన్న ఆడదాన్ని సాధారణంగా వదలిపెట్టడు. ఒళ్ళంతా బంగారం యిల్లంతా బంగారంచేసి వదలుతాడు.

నర—డబ్బుగలవాడు గనుక యేపనిచేసినా చేస్తాడు. బాగా చూచిన జ్ఞాపకంలేదు. ఎన్నేళ్ళుంటాయేమిటి? అతని పేరేమిటి?

హీర—నిన్ను చాలాసారులు ఆతడు చూచినాడట. 25 సంవత్సరాల లోపువాడు, యెర్రగావుంటాడు, గుండ్రనిమొగము, అందమైనవాడే. చెవులకు దుద్దులు, చేతులకు బంగారపు గొలుసులు, మురుగులు, తోడాలువుంటాయి. నీకు జ్ఞాపకంలేదుగాని చూచేవుంటావు.

నర—ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది. అతడా! మహాపోకిరిఅండీ.

హీర—కుర్రతనంగాని మరోటిగాదు, మాయింటికి తరుచువస్తూనే వుంటాడు. ఈసారివచ్చినప్పుడు చూపిస్తానువుండు.

నర—ఏమిపనివుంది లెండి.



పిర—పిచ్చిదానవులావున్నావు. అలాటివాళ్లో అందవుందంటే ఎంతలాభం అనుకొన్నావు.

నర—వాళ్ళఅంద మనకు యెల్లావస్తుందండీ?

పిర—వెఱ్ఱిదానవులావున్నావు. నువ్వేమి గ్రహించుకోవడంలేదు. నీ సౌందర్యమే వాళ్ళను నీయింటికాడ కుక్కల్లాగు చేస్తుంది.

నర—పోస్తురూ. ఎందుకీప్రశంస?

పిర—నేను యేమో చెప్పుతున్నానని అనుకోవద్దు. ఆసుబ్బారావుదయ నీవు సంపాదించు. దీనివలన వచ్చేహాని యేమీలేదు. మీ యింటికాడ వ్యవహారం చక్కపెట్టుకోవచ్చు. నిన్నుచూస్తే నాకు చాలాజాలివేస్తూవుండడంచేత చెప్పినాను కాని మరోటికాదు. ఇక్కడవ్యవహారం హరిహరబ్రహ్మాదులకైనా తెలియదు. నువ్వు ఊ అను. నీవళ్ళంతా బంగారంచేస్తాను.

నర—పిన్నిగారూ! నేనిల్లాటి పను లెప్పుడూ యెఱుగను. ఇల్లాంటివంటి నాకు చాలాభయమేస్తుంది. ఈపాపంచేయడంవల్ల యిహలోక సౌఖ్యానికి యిదివరకే చెడ్డానుగదా పరలోకసుఖంకూడా లేక పోతుంది. ఎందుకీలాటి నీచపుపనులుచేసినలుగురునోట్లోపడడం.

పిర—ఎవ్వరూవినరు. రహస్యంగానే జరుపుకోవచ్చును. ఎవరికైనా తెలిసిందంటే నన్ను తుపాకీవెయ్యి. నీవావిషయమై సందేహించవద్దు, ఇప్పుడు నిజం నీతోచెప్పుతున్నాను. ఎల్లాగయినా నిన్ను అతనికి లభింపజేస్తే నీకు మూడు నవర్సులుయిచ్చి ముందు మురుగులు చేయిస్తానన్నాడు. ఎన్నాళ్ళు మీఅయినకష్టపడితే వచ్చిన సొమ్ముపెట్టి నీకుమురుగులు చేయిస్తాడు. ఏమంటావు నామాట నిజమేనా కాదా.

నర—ఏమిటోనండీ. నామనస్సు యిల్లాటి పాపకార్యం చెయ్యడానికి వప్పుకోవడం లేదు. ఏమిచెప్పడానికి నోరురావడంలేదు.

హిర — నీవిట్లా సందేహిస్తూ వుంటే యెప్పటికీ మనతనువు తెల్లవారదు. జన్మమెత్తిన దెందుకు? బ్రతికిననాలుగునాళ్ళు సౌఖ్యంపొందడానికి. సౌఖ్యంఅనగా నేమిటి? కావలసిన బట్టకట్టుకోవడం కోరుకొన్నవస్తువులు పెట్టుకోవడం. యౌవనుడైన పురుషునితో కాపురంచేయడం. ఈసుఖం లేకపోయినతరువాత జన్మవుండేం లేకేం. ఇప్పుడు నాతో పేకఆడుతూవున్న సుబ్బమ్మనుచూచినావా. దానిభర్త చిన్నతనంలోనే పోయినాడు. ఈవూరు వచ్చింది. మొదటవాన్నిచూచినప్పుడు నాకు జాలిచాలావేసింది. ఇల్లాటివాళ్ళను చూస్తేనాకు జాలివేస్తుందని నేను యిదివరకే నీతోచెప్పివున్నానుగదా. అప్పుడది మాయింటికి వస్తూపోతూ వుండేది. నెమ్మదిగా దానికి ఒకమంచి కోమటిప్రియకం సంపాదించిపెట్టినాను. దానికి యిప్పుడు యేమీలోటులేదు. ఈసంగతి యెవ్వరికీ తెలియదు. నీవు కాబట్టి చెప్పినాను. నీవైనా ఈరహస్యం ఎక్కడా బయలుపెట్టవద్దు. అదివితంతువు. ఈలాంటిపనులు చేయడానికి దానికే యెక్కువభయం వుండవలసింది. కడుపూగట్రా వచ్చిందంటే యింకేమయినావుందా. అల్లాటి వేమీరాకుండా అవుషధాలుతిందిలే. నీకల్లాటి అవసరంయేమీ లేదు. దానిచెల్లెలు సత్యం. అదికూడా దానిపురాకృతప్రారబ్ధంకొద్దీ వెధవదియైంది. ఆసత్యాన్నికూడా నీవుచూశావుగదా. దానికి ఒక కరణం ప్రియకం దొరికింది. దరిద్రవిచ్ఛిత్తయింది. యింకోచెల్లెలువుంది దానిమొగుడున్నాడు. వున్నప్పటికీ యెప్పుడయినా అక్కలను జూడడానికివచ్చి యేనెల్లాళ్ళో వుండి అధమపక్షము రూ 100 లన్నా యేమోస్తరుగానో పట్టుకొని వెళ్ళుతుంది. గోదావరికి యిద్దరిని రాజమహేంద్రవరంవుంది. అద్దరిని వాళ్ళవూరువున్నదిలే. తరుచువస్తూనేవుంటుంది. కాబట్టి దీని

వల్ల నీకు లాభమేగాని నష్టమేమీలేదు. నామాటవిను. ఇందు
కు ఒప్పుకో.

నర—(తనలో) ఈవిడ చెప్పుతూవున్న మాటనిజమే. పొట్టకూ బట్ట
కూగూడా మొగంవాచివున్నాను. ఈలాటిపనినేను రహస్యం
గాచేస్తే యెవరికి తెలుస్తుంది. ఎవరోకోమటి అని చెప్పుతూ
వుంది. షావుకారు అవటంచేత మరీలాభంవుంది.

వీర—ఏమి నామాటకుఒప్పుకొన్నట్టేనా. ఊరికేఆలోచించకు. రేపు
ఆసుబ్బారావును పిలిపిస్తాను. మధ్యాహ్నం రెండుఘంటలకు
యిక్కడకురా.

నర—పిన్నీ. నీవుపెద్దదానవు నీమాట తీసివేయడానికి నేనెంతటిదాన్ని?
నీయిష్టప్రకారమే వస్తాను.

వీర—రేపు రెండుఘంటలకల్లా యిక్కడకురా. అన్నియేర్పాటులు
నేను చేస్తాను పద. (నిష్క్రమింతురు.)



రంగము:—[సోమయాజులుగారి గృహము సమీపమున-
కేశవరావు ప్రవేశము.]

కేశ—(తనలో) అమ్మయుండ ఆవీరమ్మ చూస్తూచూస్తూ వుండగనే
నరసమ్మను. ఒడుపేసి రకంలో చేర్చింది. కోమటిసుబ్బారావుకీ
దీనికి స్నేహం కలిపినదట. రోజూయిదిమధ్యాన్నం వీరమ్మయిం
టికి వెళ్ళుతూవుండడం, అతను అక్కడికి రావడంతటస్థిస్తూవుం
దట. ఆసుబ్బారావు యీవిడకు మురుగులు అప్పుడే చేయించి
పెట్టినాడట. ఆచేతికివున్న మురుగులు, చెవులకువున్న తెల్లరా
ళ్ళదుద్దులు అతడు చేయించిపెట్టినవేయని సుబ్బమ్మచెప్పింది.
ఈపేటలో ఈవీరమ్మచేరి ఎంతమందికొంపలు తీశేస్తూవుందరా
బాబూ. ఇక్కడనుంచి దీనిని వెళ్ళగొట్టించేమార్గం చూడాలి

(ఆలోచించి) కాదు. కాదు. వెళ్ళగొట్టించితే నాబోటివాళ్ళకు కాస్తఆసరా తగ్గుతుంది. కాబట్టి యిదివుంటేనేమంచిది. ఎప్పుడయినా ఏఅవసరమయినా వస్తుంది. (ఎదుటజూచి) ఇదే సోమయాజులుగారియిల్లు. ఆయన కేయేవూళ్ళల్లోనో వార్షికాలు వుంటే తెచ్చుకోవడానికి వెళ్ళినాడట. ఇంకా ఒకమాసం రోజులుదాకా రాడట. ఇప్పుడు నేను నెమ్మదిగా నీరింట్లోకివెళ్ళి నరసమ్మను ఒడుపెయ్యాలి. ఒప్పుకోకుండావుంటుందా మీదుమిక్కిలివచ్చిందంటే కోమటివ్యాపారం అంతా తెలిసిందని ఢమాయించి బంధం వేస్తారు. నేనుమాత్రం సామాన్యుడనా యేమిటి? ఈయింట్లోకూడా రెండోవారు లేరు వారుఒక్కరే కాపురం వున్నారు. పిలిచి నెమ్మదిగా బాతాఖానీ వేస్తాను. (తలుపుగొట్టి) ఏమండోయి సోమయాజులుగారూ. సోమయాజులుగారూ.

[లోపల]

[ఎవరువారు. వారువూళ్ళో లేరు.]

కేశ — తలుపుతీయించండి.

[తలుపు తెరుచును]

నర — వారువూళ్ళో లేరు. అమలాపురం వెళ్ళినారు. ఇంకాపదిపదిహేనురోజులుదాకా రారు.

కేశ — వారు వూళ్ళోలేరనుసంగతి నాకు తెలుసును. నేనుయిప్పుడే అమలాపురాన్నుంచి వచ్చినాను. హోటలలో భోంచేసి యిల్లా వచ్చినాను. నేనువారినిచూచినాను. సుఖంగావున్నానని మీతో చెప్పుమన్నారు. మీక్షేమంగూడానన్నుచూచి వాళ్ళియుమన్నారు. నేనుయింకా ఇక్కడపదిరోజులు వుంటాను. రాత్రిళ్ళు మాయింటికాడ కావలసినంత జాగావుంది పడుకోమనిగూడా చెప్పినారు.

నర—ఆయనక్షులాసాగావున్నారుకదా. ఆవూరు యీవూరు అస్తమానం తిరుగుతూవుంటారు. పెద్దకాలం. యింటిపట్టునవుండమంటే వుండరు. పాపము. మీరుభోజనంచేసినారా ?

కేశ—చేసేవచ్చినాను.

నర—బసయెక్కడచేశారు ?

కేశ—మూటఅది హోటలులోనే పెట్టినాను. కాని యెవరైనా చేతి వెబ్బకొట్టుతారేమోయని భయంవేస్తూవుంది. ఆనకయిక్కడకు తెచ్చిపెట్టికుంటాను మీకేంఅభ్యంతరం లేదుకదా ?

నర—(తనలో) ఈయన యిక్కడమూట పెట్టుకున్నాడంటే అస్తమానం యిక్కడనేవుంటే నావ్యాపారానికి యిబ్బందివస్తుందేమో. వీరమ్మగారింటికి నాలుగురోజులనుంచి వెళ్ళకుండా యింట్లో యెవరూ లేరుకదా అని సుబ్బారావును యిక్కడికే పిలిపిస్తూవున్నాను. ఇక్కడ మూటపెట్టుకోవడానికి వల్లకాదంటే రేపుమాఆయనతో యీయనచెప్పినాడంటే యేమిచీవాట్లుతగులుతాయో. (ప్రకాశముగా) అందులో యేందబ్బుందో యేమిటో. నేనూఒంటరిదాన్ని. తరువాత యెల్లాపోయి యెల్లావచ్చినా కష్టమే.

కేశ—దబ్బుకాదు. మన్నువుంది. అయినామీదయవల్లయీప్రాణ్ణోన్ననైనాదబ్బుదొరకాలికాదు. చూడండిమీకేంభయంలేదు. అందులోయేమీలేదు, ఏమూటలో పడేస్తేవుంటుంది. నేనుఅస్తమానం వూళ్ళోనేస్త్రీలవర్ల యింటికివాళ్ళయింటికి వెళ్ళుతుండాలిలెండి

నర—స్త్రీలవర్ల యింటికి వెళ్ళడం యెందుకండీ.

కేశ—నేను "అస్ట్రాలజర్ను" అనగాజ్యోతిష్కుడినిలెండి. అందుచేత వాళ్ళచేతులుచూచి జాతకంచూచి జరిగినవి జరుగనున్నవి చెప్పేశక్తివుంది. ఇదేనావృత్తి.

నర——నా చెయ్యిచూచి చెప్పుతారా. నేనుమాత్రమేమిా డబ్బు యిచ్చుకోలేను.

కేశ——మిాయింటికి వచ్చినానుగదా. మిాదగ్గరడబ్బు పుచ్చుకోవాలీ. మిాదయవుంటే చాలదా.

నర——లేకలేక మాబోటి బీదవాళ్ళదయే వుండాలీ ?

కేశ——ఏమిటో మిమ్మల్నిచూస్తే నాకు అదిఒకమోస్తరు అనురాగం విచారంగూడా వేస్తూవుంది. పాపము. మిారు కోప్పడనంటే చెప్పుతాను. మిారుచక్కగా నవయావ్వనములోవున్నారు. మిాభర్తగారికి 60 సంవత్సరాలు దాటవచ్చినాయి. మిాతల్లిదండ్రులు యెల్లాయిచ్చినారోగాని యీయనకు తెలియకుండా వెధవ డబ్బుకోసం యిల్లాపిల్లల గొంతుక్కాయలు కోస్తారు.

నర——(సిగ్గుపడును)

కేశ——ఏమంటారు. నేనన్నమాట నిజమేనా. కాదా. మిారు సిగ్గుపడకండి. ఇక్కడయెవ్వరూలేరు.

నర——ఇప్పుడనిఅంతా యెందుకులెండి.

కేశ——అదికాదు. నేనుమాటవరుసకంటున్నాను. మొగుడితోసౌఖ్యమాలేదు. పోనీ డబ్బా అంతకంటెలేదు. దరిద్రమా తప్పింది కాదు. నిజంగామిారు నాబోటివాళ్ళను మ్యారియేజుచేసుకొంటే యిల్లావుంటుందా. మిారేచెప్పండి. ముక్కచెప్పడానికేమండీ.

నర——అవునండి.

కేశ——అవునాఅంటి మరి. నేననేక వూళ్ళు పెద్దపెద్దటౌన్సు, సిటీస్, అనగా కలకత్తా, బొంబాయి, మెడ్రాస్, నెల్లూరు, రాజమండ్రి, కోకినాడ, వైజాగ్, విజయనగర్, మొదలయినవెల్లా వెళ్ళుతుంటాను. ఒకచోట ఒకతమాషాఅయింది. చెప్పితే నవ్వువస్తుంది. ఒకచోటఒకవ్యాపారి ఆవిడ వుంది. ఆవిడ అంతఅంద

మైనదికాదుగాని సామాన్యపుఅందకత్తెలలో ఒకర్తె అని చెప్ప వచ్చును. మంచి ఆజానుబాహువు కోమట్లయిండ్లో పుట్టవలసిన మనిషి లెండి. తప్పిదారి అందులో పుట్టింది. భర్త పట్టె అమాయకుడు. ఏగోలంఅక్కరలేదు. ఆవిడ మొగం చూడగానే నేను యేమై తేలయిందసి, చెయ్యిచూచి, కంకణగ్రామంలో రైలు యిలాకా ఒకవుద్యోగస్థునికిన్నీ, ఒకతపాలాఫీసు వుద్యోగస్థునకిన్నీ, మీకూస్నేహంవున్నదని చెప్పేశాను. దానితో డంగైపోయి నిజమే, నిజమే, ఈరహస్యం యెవ్వరితోను చెప్పవద్దని కాళ్ళమీదపడ్డది. అంతేకాకుండా నన్నుగూడా టోపీలో వేయాలని ప్రయత్నంచేసింది. నేను వప్పుకుంటానూ. నేను "బ్యాచిలర్" నే అనగా బ్రహ్మచారినే అనుకొండీ. అయితే నా మైండ్ యెవ్వరిమీదకు వెళ్లుతుందో వారినే చేరదీస్తాను. వారినే బాగు చేస్తాను. వారినే మహారాజు భార్యకంటె ఎక్కువగాచేస్తాను. అనేకచోట్ల అనేకమంది తమంతట తాము వలచి మీదపడడానికివస్తే తప్పించుకొన్నాను. నామనస్సు సాధారణంగా చలించదు. కాని యీవూరువచ్చినతరువాత ఒకరినిచూచినాను. హృదయం చలించిపోయినది. అటువంటికాంతనాకు "వైఫు"గా వుంటే యెల్లావుండునురా అని అనుకొన్నాను. అయితే యేమిలాభం. నామనస్సునాతో "ఓయీ ! కేశవరావు నువ్వు చూచిన ఫిమేల్ చాలా బ్యూటిఫుల్ గర్లే అయితే అది యింకొకరి ప్రాపర్టీ. అందనిపళ్లకు చేతులుజాపితే యేంలాభం" అని బోధస్తూవుంది.

నర—(తనలో) ఈయనచాలాగ్రంథసాంగుడే (ప్రకాశముగా) ఆవిడ యీవూళ్ళోనే వుందా యేమిటి ?

కేశ—ఈవూళ్ళోనే యిక్కడే. ఇంతయేల. నా యెదుట వున్నట్టేవుంది

నర—ఆవిడ అంత అందమైన మనిషాఅండి.

కేశ—నాకు అందమైనదే. తావలచినది రంభ. తామునిగినది గంగ అన్నారు.

నర—వారిల్లెక్కడ? ఆవిడయెల్లావుంటుందేమిటి?

కేశ—ఇక్కడే! చెప్పితే నమ్ముతారోలేదోగాని అంతా మీమోస్తరే, మిమ్మల్ని చూస్తే ఆవిడను చూడనక్కరలేదు. అంతామీతీర్చే, శరీరచ్ఛాయ మీమోస్తరే.

నర—సరిసరి. అంతా నామోస్తరేవుండాలి. ఈనిర్భాగ్యురాలిపోలిక యెవ్వరికీ రావద్దు. మీరువలచిన ఆవిడభర్తకు యేంపని?

కేశ—ఆయనకు 60 యేళ్ళు వుంటాయి. అక్కడా యిక్కడా పురాణ కాలక్షేపం చేయడం.

నర—(తనలో) ఇది యేమిటి? ఈతడు నన్నుద్దేశించే అన్యాపదేశంగా పలుకుతున్నాడు. (ప్రకాశముగా) ఏమండోయి మీరింకా యేమోఅనుకొన్నాను. చాలుచాలులెండి. సరసాలు. మీమాట నేను గ్రహించలేననుకొన్నారా యేమిటి?

కేశ—(తనలో) ఆడవాళ్లు యిల్లాటివ్యాపారాలు వచ్చినప్పుడు ముందు కాస్త కోప్పడుతారుగాని తరువాత వాళ్ళే దయతలుస్తారు. (ప్రకాశముగా) మీరు గ్రహించలేరని నే ననుకుంటానా? మీ రావలిస్తే పేగులు లెక్కపెట్టే సమర్థులు. ఆ సమర్థత నామీద కనుపరుస్తే యేంలాభంవుంది. నేనుమీదయగోరి వచ్చినాను. నన్నుకాస్త మీకటాక్షసముద్రములోముంచాలి. మనరహస్యాం యెవరికైనా తెలుస్తుందని అనుకొంటారేమో ఏమీ తెలియదు సందేహించకండి. (చెయ్యిబట్టుకొనబోవును)

నర—ఏమండో యీసరసాలు ముదురుతున్నాయే రమ్మనిబసయిస్తే వాసాలు లెక్కపెట్టిన సామెతయిందే. మానుష్యుల మంచిచెడ్డ

లెరుగకుండా మాట్లాడుతారేమిటి! మాబాగావుందే నడవండి నడవండి.

కేశ—రమణీ! నేనబద్ధం ఆడడంలేదు. నిన్నుచూచేటప్పటికల్లా దయలేకుండాఆమన్మధుడు డ్యామ్‌రెచెడ్‌ఫెలో నామీదతనబాణాలు ప్రయోగిస్తూ శరీరమంతా తూట్లుపడేటట్టు చేస్తున్నాడు. నీదయవుండాలి మనమిద్దరంగలసి వాడిని యుద్ధాలో చెడ్డాలు యెక్కేయ్యాలి. బాత్తిగా భయంలేకుండా వున్నాడు.

నర—మీవేషం బాగానేవుంది. ఈసంగతి యెవరన్నా విన్నారంటే మీకు యెంతహానిస్తుంది. మీరేమో పెద్దమనుష్యులు అనుకొన్నానుగాని ఇల్లాటి తుంటరివాళ్ళనుకోలేదు. పరాయి ఆడవాళ్ళను ఇల్లాఅంటే వూరుకొంటారా బుద్ధిచెప్పిస్తారుగాని! మిమ్మల్ని చూసేనాకు చిరాకువేసుకొని వస్తూవుంది వెళ్ళండి. అవతలకు మర్యాదగా. లేకపోతే కష్టము.

కేశ—నాకు బుద్ధిమీరే చెప్పాలిగాని మరొకరిచేతమాత్రము చెప్పించకండి యేమిటో మీదయ ఆశించిఆశించి వచ్చినాను. నీవుసామాన్యపుదానివిగావు. బాగా చదువుకొన్నావు. కాస్త నామీద దయజూపాలి నాస్నేహం నీకెంతలాభం వుంటుందనుకొన్నావు. నేను కవీశ్వరుడినికూడాను.

నర—ఇల్లాటివి యిక్కడసాగవు. అదిచాలాతప్పు మీదారిని మీరుపోండి యిందుకా మూటకూడా యిక్కడే పెట్టుతానన్నాడు.

కేశ—

మ. ఒకమాటించుక యాలకింపుమిపు డో । హా యజ్ఞపత్నీ! శ్రీ; ఛా
వక కారుణ్య సుధారసంబిపుడు దా । వక్క వచ్చియున్నానే; స
న్నకలంకస్థితి జూచి నెమ్మదిని ను । ద్యత్ప్రీతిగాపాడక
వికట భ్రూకుటి దుర్నిరీక్షతని ! యిట్లే । పేక్షింపగా ధర్మమే

(దగ్గరకు జేరబోవును)

నర—ఇదిగో మీరు దగ్గిరకు రాకండి కేకలువేస్తాను.

కేశ—

మ. తరుణీ! దూరపథశ్రమాగతుడ నా । తాపంబు జల్లార్ప వే
కరణిన్ దప్పని పల్కఁగాదగునె యా । కాముండు కోపంబునన్
శరముల్ జిమ్ముచునుండ నేగతినిఁ బ్రా । ణంబుండు దేహంబులో
శరణం బెవ్వరివేడుకొందు చెపుమా । సంపూర్ణచంద్రాననా.

మ. సకలస్థావర జంగమాత్మక ప్రపం । చంబందు సద్బ్రహ్మలై
నకవీశాగ్రణులే నృపాలకులు నా । నాసౌఖ్యభోగంబులన్
సుఖముల్ గాంతురు వారికేయెదురు నె । చ్చోలేదు వీక్షింప నీ
కిక దాసుండను నేమి చెప్పుదునునే । వి ద్యాపరా భారతీ

ఇదిగో చెప్పుచున్నాను. నాస్నేహం వూరికేపోదు. వెధవడబ్బుకోసం నేనుఆలోచించేవాడిని గాను అల్లాటిగుణం లేనివాళ్ళను బలవంతపెట్టేవాడిని గాను. కావాలంటే నీచెయ్యిచూచి సమస్తము చెప్పుతాను ఇల్లాతే నీచెయ్యి (ముట్టుకొనబోవును)

నర—నాచేయి ముట్టుకోకండి

కేశ—పోనీలెండి మొఖంచూసే చెప్తాను. (ఆలోచించి వేళ్ళు లెక్కపెట్టి) మీరు కోప్పడకండేం! నిజంగాచెప్పండి పదిరోజులకిందట యీవూళ్ళో ఒకవెధవఆవిడ మీకున్నూ ఒక కోమటికిన్నీ స్నేహం చేయించలేదూ? ఆకోమటి మీకు రెండు వస్త్రవులు చేయించలేదూ? అవునా కాదా చెప్పండి!

నర—(తనలో) ఈయన యెవరోగాని దేవుడులాగున్నవాడు. ఈసంగతులుకూడా యీయన యెల్లాచెప్పినాడో ఈయన నాపరువేమితీస్తాడో. కర్మం బాగానేవుంది. అయినా కాస్త తీక్షణంగా కోప్పడి చూతాము (కోపముతో) సరి సరి ఇదికూడా ఒకటి తెచ్చిపెట్టున్నారు మాకు. మీజ్యోతిషము తీసికొని వెళ్ళి

అగ్నిహోత్రంలో పడవెయ్యండి. (కోపముతో జూచును.)

కేశ—

మ. ననువీక్షించిన మోముదిప్పటమరి । న్నామాటలాలించినన్
కనుబొమ్మల్ ముడివేసి కన్నుల మహో । గ్రంబైన దృష్టిన్ ననున్
గినుకన్ జూచుచు బండ్లునొక్కుచు మదిన్ । వీక్షింపగానేల; యు
ల్కను వీడంగదె చేతనైన యెడలన్ । గంజాస్త్రి వారింపవే.

వర—(తనలో) ఈతనితో స్నేహం చేస్తేనే బాగావుంటుంది. లేకపోతే నాసంగతి టమటమాయిస్తాడేమో. కాని, యెల్లాగాఆవీరమ్మ నన్నీ వ్యాపారంలోకి దింపిందిగదా. నూరునోములూ ఒక అంకుతో సరి యన్నట్లు దుర్వృత్తిలోకి ప్రవేశించిన తరువాత ఒకనైతేనేమి రెండయితేనేం. (ప్రకాశంగా) మీకు నామీద యెంత యనురాగం వుంటుందో కనుక్కోడానికి యిల్లా అన్నాను గాని మరోటికాదు. మీరాగ్రహించవద్దు. ఇంతటినుంచి నేను మీ స్నేహితురాలనని భావించండి రండి. ఈపూట భోజనం యిక్కడనే చెయ్యండి.

కేశ—నేను భోంచేసివచ్చానని చెప్పినానే. నేను మళ్ళీవస్తాను. ఈలోపుగా నీభోజనంకూడ అవుతుంది.

వర—తప్పకుండా రావాలిసుమండీ.

కేశ—మరోమోస్తరా. (ఇవతలకువచ్చి) మనపాచిక పాటెంది. కాని నేను యీవూరువాడిని కానని అనుకొంది. నెమ్మదిగా నారహస్యం చెప్తాను. అప్పుడేమి చెయ్యలేదు. ఈఫ్రెండ్‌షిప్ లాంగు స్టాండింగుగానే వుంటుంది. నేను యికవెళ్ళి యీవిడ భోంచేసేటప్పటికి వస్తాను. (నిష్క్రమించును.)

వర—(తలుపువేసికొని నిష్క్రమించును.)



[రంగము:—సింహాచలము కొత్తమందిరములో

[చంద్రవదన, సింహాచలము బ్రవేశము.]

చంద్రి—అమ్మాయీ! సింహాచలమూ! పావుకార్లుపావుకార్లంటాం గాని వెంకట్రామయ్యగారు వారినందరినీ మించినారు. మేడకట్టిస్తామని యిట్టేకట్టించారు.

సింహా—అమ్మా! తరువాత చూచినాను. గృహప్రవేశము రోజున బ్రాహ్మణులకు ఆయనయిచ్చిన సంభావన యెంత అయిందను కొన్నావు. లెఖ్ఖవేసి ఆఖర్చుచూచాం. ఆరువందల రూపాయలయినాయి. బుద్ధిపుట్టిందంటే యెంతైనా ఖర్చుచేస్తాడు.

చంద్రి—అన్నను. నీవుకూడా ఆయనయందు బాగాఅనురాగంవున్నట్టు గనిపిస్తూ డబ్బు చేదుకోవాలి. ఆయనదగ్గర డబ్బులాగడానికిదే సమయం. డబ్బంతా అయిపోవస్తూంది అనివిన్నాను. మనకు కాళ్ళంతా శాశ్వితమనుకొన్నావా యేమిటి? యిల్లాటివాళ్ళు హనచేతిలో ఎంతమంది అవుతారో.

సింహా—అస్తునమ్మా! ఆయన ఆమధ్య చెన్నపట్టణం వెళ్ళినప్పుడు టాకరుఅండ్ సన్సుకంపెనీలోకొన్న వుంగరం నాకిమ్మనిఅడిగినాను. వాల్లగోలు మోజు తీరినతరువాత యిస్తానన్నారు. అదిచాలా ఖ[illegible] ౩౯౦ రూపాయ అయిందంట. ఒంటిరాయి నజ్పు టూ[illegible]యు.

చంద్రి—[illegible]టన్నిటికీ ఏమిగాని వెంకట్రామయ్యగారి పేరువుంటే వాళ్ళ వాళ్ళు యేమయినా తగాయిదాపడుస్తారేమో అని యీయిల్లు పస్తుతం సుబ్బయ్యగారిపేర పెట్టించాలి. ఈయన కోమటి ఎత్తుల్లోవాళ్ళు. ఈకాస్త ఆయన పెరుమాళ్ళకైంకర్యం చెయ్యగూడా నేను యెల్లాగో ఒకలాగున టోపీవేసి మనపేరుపెట్టించేలాగు నేను చేస్తానులే. (ఇంచుకయూరకుండి) సరేగాని వెంక

టాద్రిమయ్యగారు ఇప్పుడు కలకత్తా యెందుకు వెళ్ళినారో నీతో చెప్పలేదా.

సింహా—నాతో చెప్పలేదు, రేపో యెల్లుండో వస్తారు.

[రామన్న ప్రవేశము]

చంద్రి—ఏం రామన్నా! యీలా వచ్చినావు, ఏదో పనివుంటేనే గాని రావు.

రామ—పనివుండబట్టే వచ్చాను. వెంకటాద్రిమయ్యగారు కలకత్తానుంచి యింకా రాలేదా యేమిటి?

చంద్రి—రాలేదు.

సింహా—రేపో యెల్లుండో వస్తారు, ఏంపనివుంది?

చంద్రి—మేళాల్లోకి వెళ్ళుతున్నావా.

రామ—ఏమి మేళాలమ్మా! గొప్పగొప్పవారంతా బయలుదేరి భోగం వాళ్ళను మేళాలకి పిలువకూడదంటున్నారు. అది కాకపోయినా మీ మేళం వున్నప్పుడు తిత్తివూదడానికి వస్తే ఓపావలాడబ్బులు దొరికేవి. ఇప్పుడుమీరు గొప్పసానులయిపోయి మేళాలుకట్టడం మానివేసినారు. ఏకూలో చేస్కొని బ్రతుకుతున్నాను.

చంద్రి—సుబ్బయ్యగారికిగాని, వెంకటాద్రిమయ్య గారికిగాని మేము మేళాల్లోకి వెళ్ళడం యిష్టంలేదు.

రామ—అవును. మీయిద్దరికికూడా మంచిప్రాపకం దొరికింది. హాయిగా గుఱ్ఱపుబళ్ళు యెక్కి తిరుగుతారు, నౌఖర్లు, చాకర్లు, పోనీ బీదవాడినిగదాఅని నావిషయమై కాస్త సుబ్బయ్యగారితో చెప్పి యేకోర్టుదగ్గర అయినా చిన్ననౌఖరీఅయినా చెప్పించవు. మీ కులంవాడినిగదా, కూటికి పేదఅయితే కులానికిపేద కాదుగదా.

చంద్రి—ఈమాట నువ్విదివరకెప్పుడయినా చెప్పినావా? ఇప్పుడు చెప్పినావుగనుక గ్యాపకం వుంచుకొంటాను. ఇంతకూ ఇప్పుడునువ్వు

వచ్చినపని యేమిటి ?

రామ—మరేం గొప్పపని యేమీలేదు. మీఅమ్మాయిని యిప్పు డెవ్వరిదగ్గిరకూ పంపడంలేదు కాబోలు.

చంద్రి—ఇప్పుడాసంగతి యెందుకు ?

రామ—ఎందుకయితేనేమిలే. చెప్తే చెప్తారు.

చంద్రి—రామన్నా ! వెంకటాద్రిమయ్యగారు దీనికి కావలసినంతసొమ్ము యిస్తున్నారు. ఏమీ కొరతలేకుండా వుంది. ఇల్లావున్నప్పుడు నాలుగింటికి అయిదింటికి ఆసపడడం, చివరకు వెంకటాద్రిమయ్య గారికి తెలియడం యిదంతా యెందుకువచ్చినగోల అని అల్లా టివి మానివేసినాను. చూచావుగాదూ. నీలాచలానికి యెంత డబ్బు యిచ్చాడు వెంకటాద్రిమయ్యగారు. దానితో సంతృప్తి పొందక, తుంటరివేషాలు వెయ్యడంచేతనే కాదూ వదలి పెట్టేసింది.

రామ—దానిమాట కేమిలే. గుట్టుదాచుకోక పోయింది. అదిగాకుండా మీఅమ్మాయిని 4, 5 కు పంపడం నాయిష్టంకాదు. ఎవ్వరన్నా గొప్పజమీందారుల వంటివారు వస్తే పూర్తిగా సంతోషపరు స్తాను. అలాటి అప్పుడు ఒప్పుకోకపోతే బాగుండదు.

చంద్రి—నువ్వుచెప్పినమాట నిజమే. ఆమధ్య ఒకరు బరంపురాన్నుంచి వచ్చినారు, నాయిళ్ళట, కబురుపంపించినారు, చాలాగొప్ప వారట, ఏమో వెంకటాద్రిమయ్యగారు వూళ్లోలేరుగదా అని ఒప్పుకొన్నాము. ఒప్పుకొన్నందుకు ఆయనకూడా అమ్మాయికి 100 రూపాయలుయిచ్చి వెళ్ళినాడు. అలాటి పద్దేదన్నా కనప డితేనేతప్పు చిల్లరవిషయం మామనస్సులోకి తెచ్చుకోవడం లేదు ఎందుకు వళ్ళు గుల్లచేసుకోవడం.

రామ—నిన్ననే యీవూళ్లోకి హైదరాబాదునుంచి ఒక జాగీరుదారు

శ్యామ — ఏదీ! ఆసింహాచలం యింకా యివతలకు రాదేమి? పాపము నీభోజనమయింకా అవలేదు కామోసు.

రామ — భోంచేస్తాను. తమ పాదసేవకంటె నాకు అన్నంతినడం యెక్కువా. తమపనిసఫ్లయిచేసి వెళ్లుతాను. ఇంకా లోపల ఆల స్యం యేమిటో కనుక్కొనివస్తాను. (నిష్క్రమించును.)

శ్యామ — (తనలో) ఈవూరువచ్చి జమీందారునని పేరుపెట్టుకొని నెల్లాళ్ళబట్టి వుంటూ గ్రామంయొక్క ఆచోకి తీశానుగదా. ఈచంద్రవదన కూతురికి వంటిమీద ఇరువై వేలరూపాయల నగ లున్నాయని విన్నాను. అవిఅన్నీ యీరాత్రి పెట్టుకొండా దాని కొంప గూల్చినవాడనే. లేకపోతే నేను దీనికిప్పు డిచ్చే వెయ్యి రూపాయలైనా తీసుకొనలేకపోతానూ. వస్తువులు కత్తిరించే సామాను తెచ్చినానుగదా. పైగా యీసింహాచలం కాస్తడోసు కూడా వేస్తుందని విని యక్షానంబరు వకబుడ్డీ పట్టుకొని వచ్చి నాను. నెమ్మదిగా దానితో చల్లనికబురులు చెప్పుతూ రెండు డ్రాములు తాగేటట్టు చేస్తినా కైపెక్కి నిద్రపోతుంది. ఆస మయంలో దీనివస్తువులు అన్నీ తస్కరించేది. నెమ్మదిగా తలు పుతీసుకొని వుడాయించేది. కానీ, భగవంతుడున్నాడు. అదుగో రామన్న వస్తున్నాడు.

రామన్న — (ప్రవేశించి) బాబూ! వస్తూవుంది. చీరకట్టుకోవడం ఆల స్యమైనది.

[సింహాచలం ప్రవేశము.]

సింహా — (శ్యామసుందరరావును చూచి) పంతులుగారూ! నమస్కా రములు.

శ్యామ — దా. ఇల్లాకూర్చో.

సింహా—పరవాలేదు. కూర్చుంటాను లెండి. తమవంటి జాగీరుదారులు వచ్చినప్పుడు తగినట్టు మర్యాదలు చేయడానికి బొత్తిగా బీద వాళ్ళమై యున్నందుకు చాలా విచారంగావుంది. ఏమిటో మట్టికొంపలు, నులకమంచాలు.

శ్యామ—ఓహో! గొప్పవాళ్ళు గొప్పవాళ్ళమని చెప్పుకోరుగదా! మాహైదార్బాదులో యిటువంటి మేడగలవేశ్య ఒకటీలేదు.

సింహా—ఆవూళ్లో మేడలకేమితక్కువ. తమదు పెద్దమేడ అని తోస్తుంది.

శ్యామ—అదోమోస్తరు యిదోమోస్తరు. మాయింటికాడనుంచిమా ఆఫీసువరకుచూశావు బెజవాడలో బాదరురైలు యెక్కేస్థలానికి, చెన్నపట్టణం రైలుయెక్కే స్థలానికిమధ్య రయిల్వేవంతెన వుండే ఆమోస్తరుగా మాయింటివద్దనుంచి పైగా ఆఫీసువరకు వంతెనవుంది. అది నేనేకట్టించాను. మూడులక్షలరూపాయ లయింది. ఒకసారి హైదరాబాదురారాదూ! అన్నీ చూడ వచ్చును.

సింహా—తమదయ వుండాలిగాని రావడానికేమి. ఇప్పుడల్లా అంటారు గాని తీరావస్తే అప్పుడు మీరు మమ్మల్ని చూస్తారా!

శ్యామ—ఏంతమాట అన్నావు. మర్చిపోతామనుకొన్నావా యేమిటి?

సింహా—తమసంగతి అంతా యీరామన్న చెప్పినాడు. మీరు మాయింటికిరావడం గంగానది చొటినేలమీాద పాఱినట్లున్నది.

శ్యామ—సన్నేకాదు నవాబులంతటి వారెనిగూడా నీసౌందర్యము అట్రాక్టుచేస్తుంది.

సింహా—ఏమిటో మీకు నాయందు పూరాదయ వుండడంచేత నేను చాలా అందకత్తెనని చెప్పుతున్నారు. మీహైదరాబాదులో నాతాతలంతటివాళ్ళున్నారు.

శ్యామ—వెధవది మోటదేశం. యెడ్డిమనుష్యులు. నీకాలిగోరుకైనా అక్కడివేశ్యలు చాలరు. (మెడకేసిచూచి) ఈవస్త్రువులు అన్నీ నిన్నిప్పుడుంచుకొన్న వెంకట్రామయ్యగారు చేయించినవేనా?

సింహా—చాలభాగం వారు చేయించినవే. కొన్ని మాఅమ్మను వుంచుకొన్న సుబ్బయ్యగారు చేయించినారు.

శ్యామ—అన్నీ యిరవైవేల రూపాయలు వుంటాయియా?

సింహా—వుంటాయండి.

శ్యామ—నువ్వు మావూరువస్తేనా నెత్తిమీద పెట్టుకోనా.

సింహా—ఎప్పుడన్నా రావాలండీ. మీరు వెళ్ళేటప్పుడు మీఅడ్రస్సు అది యిచ్చి వెళ్ళండి.

రామ—బాబూ! పంతులుగారూ! ఇంక నేను వెళ్ళనా.

సింహా—ఇంకా భోంచెయ్యలేదా యేమిటి?

రామ—లేదమ్మాయి.

సింహా—చీసీ! ఇక్కడన్నా భోంచెయ్యలేకపోయావా! ఇంతలోమాకు పోయేది యేమిటి?

రామ—పరవాలేదు. మీఅమ్మవస్తుందేమో చెప్పి వెళ్ళుదామని వుంకొన్నాను.

[లోపల రామన్నా, రామన్నా.]

రామ—వస్తున్నాను.

శ్యామ—ఎవరది?

సింహా—మాఅమ్మలెండి.

రామ—ఎందుకో పిలుస్తూవుంది వెళ్ళివస్తాను. (నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) బాబూ. పంతులుగారూ! యిల్లా ఒక్కసారిదయచేయండి.)

శ్యామ—(రామన్నను సమీపించును.)

రామ—రహస్యంగా ఎంతడబ్బువున్నా మాబోగంవాళ్ళు వాళ్ళజాతి లక్షణం వదలరు. ఇది తమకుమాత్రము తెలియదా యేమి. ఇప్పుడే మిమ్మోల్ని అడగడం నాకుచాలాసిగ్గుగావుంది. పోనీలెండి. ఎప్పుడయితేనేం యివ్వడానికి దీనితల్లి కాస్తపిటికిదిలెండి. వెనుక ఒక మొఖాసాదారువచ్చి మొదటరాత్రికి వేయిరూపాయ లిస్తారని చెప్పి తుదకు 800 రూ. చేతిలో పెట్టినాడు. అప్పటి నుంచీ దీనికి యెవరేమిచేస్తారో అని భయంపుట్టింది. అందుకనే డబ్బు యియ్యమని అడిగింది. ఆయన అల్లాటివారు కారు. సంగతి తెలియకుండా మాటాడుతావని నాల్గుచీవాట్లు వేసినాను గాని యెందుకు దానిమనస్సు చిన్నబుచ్చాలి. తమరియ్యదల చుకొన్నది యేమిటో యిచ్చేస్తే బాగుంటుంది.

శ్యామ—ఏమిస్తే బాగుంటుంది నీవేచెప్పు.

రామ—ప్రభువులు మీకు నేను చెప్పాలా. ఇదేమీకు క్రొత్తా! ఇల్లాటిసానులను యెంతమందిని మీరు చూచారో కాని సాధారణంగా యీసింహాచలం యెవరిదగ్గిరకు వచ్చేమనిషిగాదు మహాకష్టంమీద నప్పించాను. తరువాత తమచిత్తము. ఆసామ్మామీరేయియ్యండి. నేనే యియ్యనక్కరలేదు.

శ్యామ—సరే. ఇవిగో ఇవి వెయ్యిరూపాయల నోట్లు. రెండు కట్టలు రెండు అయిదువందలవి. ఇచ్చివేసిరా. ఎవరైతేనేం.

(ఇచ్చుచున్నాడు.)

రామ—(పుచ్చుకొనితనలో) ఇందులో ఒకకట్ట నాజేబులో వేసుకొని తక్కినవి చంద్రవదనకిస్తే యెవ్వరడుగుతారు. నాదారిని నేను చక్కాబోతాను. తరువాత ఈయన యెవరో నేను యెవరో. (నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) అమ్మాయీ! సింహాచలమూ! అంతాముట్టింది. వీరు చాలాగొప్పవారు. ఎల్లానడు

చుకొంటావో నేను వెళ్ళివస్తాను. (శ్యామసుందరరావునుజూచి) బాబూభోజనానికి పొద్దుపోయింది. నేను శెలవుతీసుకొంటాను. ఉదయం బసలో దర్శనంచేస్తాను. (నిష్క్రమించును.)

సింహా—పంతులుగారూ! ఇప్పుడే మాఅమ్మకు ఒకమాట చెప్పివస్తాను కూర్చోండి. (నిష్క్రమించును.)

శ్యామ—(తనలో) నెమ్మదిగా దీనికి డోసువేయించి మొల్లోవన్నీ తస్కరం చెయ్యాలి. వెనక యేలూరులోకూడా ఒక బోగందానికి రెండువందల రూపాయలిచ్చి ఆరాత్రివెళ్ళి అయిదువేలరూపాయలనగలు కైంకర్యంచేసినాను. ఏమున్నదీ తెల్లవారేటప్పటికి మళ్ళీ వేషం మార్చేస్తాను. ఇప్పుడున్నబసకు వెళ్ళకుండా యేసాయీబువేషమో సన్యాసివేషమో వేసుకోవచ్చును. నాపత్తా యెవ్వరికీ చిక్కదు.

సింహా—(ప్రవేశించి) పంతులుగారూ! ఆలస్యమైంది క్షమించాలి.

శ్యామ—పరవాలేదు ఇంతమాత్రానికే. సరేకాని యిల్లాకూర్చో.

సింహా—(కూర్చుండును).

శ్యామ—నీకళ్ళు కొద్దిగా యెర్రగావున్నాయి యేమిచేత? అడిగినానని కోప్పడకుము. కొద్దిగా యేమయినా.—

సింహా—అదేమిటండోయి! కొద్దిగా యేమయినా అంటూవున్నారు.

శ్యామ—మరేంలేదు. విస్కీగాని, బిస్కెటుగాని యేమయినా అలవాటు కాస్త వుందేమోఅని.

సింహా—(తనలో) నేనుతాగించే విస్కీ చిక్కిడ్డాము. దిక్కుమాలిన వాసన ఆగదుకదా. ఈయన ఆనవాలుపట్టినాడు. పెద్దమనిషి దగ్గిరకూడా బయలు పడ్డది.

శ్యామ—నివ్వు సందేహించకు. నాకూ అలవాటువుందిలే. ఏమయినా హాజరులోవుందా.

సింహా——లేకపోతే నౌఖరునుపంపించిషాపునుంచి రెండునిమిషములకు తెప్పించుతాను.

శ్యామ——అక్కరలేదు నాదగ్గిర వున్నదిలే. నాకుఅప్పుడప్పుడు పుచ్చు కోవడం అలవాటుంది. ఇల్లాటిసమయంలో పొరుగూళ్ళ వచ్చి నప్పుడు నీళ్ళుపడక యేంజబ్బు చేస్తుందోఅని కాస్తపుచ్చుకొం టాను. నీదగ్గిర వైన్‌గ్లాసు యిల్లా పట్టుకురా.

సింహా——(వైనుగ్లాసు పట్టుకొనివచ్చి యిచ్చును.)

శ్యామ——(తనలో) నేనుకొద్దిగాపుచ్చుకొని తాగుతూవున్నట్టుఅటు వేపు తిరిగి పారపొయ్యాలి. నేనుగూడా పూర్తిగావేస్తే నాకార్యాము నకు భంగవస్తుంది. దీనిని పూరాగా త్రాగించాలి. (ప్రకా శముగా) ఇది సోడిదిలావుందే! వైనుగ్లాసుకూడా సోడిది చేయించావా! చాలాబాగుంది. (బ్రాందీ గ్లాసులోపోసి) నువ్వు కూడా కాస్తపుచ్చుకోమరి. భారమంతా నేను వేసుకోగలనా?

సింహా——నేనిప్పుడే కొద్దిగా పుచ్చుకొన్నాను. నాకంతచేటుఅలవాటు లేదు. మీరు కానియ్యండి. ఎక్కువగా పుచ్చుకుంటే వెళ్ళిపో తుందేమో.

శ్యామ——పరవాలేదు. ఇది వెళ్ళిపోయేదికాదు. నిషాచేసేది కాదు. పరవాలేదు పుచ్చుకో. (అని యిచ్చును)

సింహా——(త్రాగి) ఇదోమోస్తరు గులాబివాసన. ఇల్లాటిది మును పెప్పుడూ నేను చూడలేదు.

శ్యామ——ఇది బుడ్డి 15 రూపాయలు ఖరీదు. ఖరీదునుబట్టి వస్తువు యొక్క మంచిచెడ్డలు వుంటూవుంటాయి. నేనూకాస్త పుచ్చుకొం టాను. (కొద్దిగా పుచ్చుకొనును)

సింహా——పంతులుగారూ! మీరు యిప్పుడు రామన్నకు మూలమ్మకు యెన్నిరూపాయలు యిమ్మని యిచ్చినారు.

శ్యామ——ఏమి అల్లాఅడుగుతున్నావు?

సింహా——ఏంలేదు పూరికేనే.

శ్యామ——నేను వెయ్యిరూపాయిలు యిచ్చినాను. అంతా ఇయ్యలేదా యేమిటి?

సింహా——నిజమేనా. అంతసొమ్ము మీరు యిప్పుడుయిచ్చినారా!

శ్యామ——నేను అబద్ధంఆడుతానా. వాడేదో టోపీవేశాడు కాబోలు.

సింహా——ఏమయితే నేమిలెండి. సగం మాకు ముట్టింది.

శ్యామ——నేను మొదట నీకేయిద్దామనుకుంటే మీఅమ్మ యిప్పుడే యిమ్మంటె యిచ్చినాను. దానికి నేనేమిచెయ్యను, నావల్ల యేమీలోపము లేదు.

సింహా——మీవల్ల యేమీ లోపములేదు; ఇప్పుడేమనుకొన్నా యేమి లాభముంది. రండి పొద్దుపోయింది పడుకుందాం.

శ్యామ——ఇంకొక్కడ్రాము వేసుకుందాం గ్లాసు ఇల్లాపట్టుకొనిరా.

సింహా——అబ్బా! మీరు పుచ్చుకోండి. నేనుపుచ్చుకోలేను.

శ్యామ——పర్వాలేదు ఇంద.

సింహా——(పుచ్చుకొనుచున్నది.)

శ్యామ——(పుచ్చుకొన్నట్లు నటించును)

సింహా——ఏమండీ ఇది నిషాచెయ్యదన్నారు. భూమిఅంతాతిరిగిపోతూ వుంది మహాజోరుగావుందే, నాకు ప్రపంచకమే కనబడడంలేదు.

శ్యామ——(తనలో) ఇది నెమ్మదిగానిద్రకువళ్ళు తెలియకుండాపడ్డదంటే నాకార్యం నేనుచేసుకొనిపోతాను. ఆహా! దీనివంటిమీద యేం నగలు, ఇవిచూస్తే నాకళ్ళు కుట్టుచున్నాయి, త్వరగా కత్తిరించి తీసుకొనిపొమ్మని కత్తిరలు తొందరపడుతున్నాయి. (ప్రకాశముగా) పద పడుకుందాము.

(నిష్క్రమింతురు.)

[శ్యామసుందరరావు ప్రవేశము.]

శ్యామ—(తనలో) ఆహా! తానొకటితలుస్తే దైవమింకొకటి తలుస్తాడట, ఆసామ్యం నిజమైంది. ఈముండ దోసుబిగువుమీద మైమఱచి నిద్రపోతూవుందిగదా అనితలంచి నెమ్మదిగావస్త్రవులు తప్పించడానికి కత్తెరలుకత్తివగైరాలు లోపలిజేబులోనుంచి తీసేసమయంలో దీనితల్లికి తేలుకుట్టింది. దానితో అది గోల పెట్టేటప్పటికి దాసీదివచ్చి దీన్నిలేపటం మొదలుపెట్టేటప్పటికి నిద్రదెలిసి లేచింది. అక్కటా! ఏదోకొండంత ఆసపెట్టికొని ముందు నూరురూపాయలు వదిలినాను, ఇదివరకు యెక్కడకు వెళ్ళినా నాపాచిక పాఱుతూనేవుంది కాని యీవేళ యిల్లా అయినది. ఇంతమాత్రంచేత ధైర్యం వదలివేయకూడదు. ఈవూళ్ళోయింకా డబ్బువున్న నీలాచలం అని ఒకర్తెవున్నదట. దాని యింటికి సాహేబువేషముతో సరసానికివెళ్ళి యిక్కడపోగొట్టుకొన్న వెయ్యిరూపాయిలు కూడబెట్టుకోవాలి. ఈరాయభారం రామన్నచేతకాకుండా మరొకరిచేత పంపేప్రయత్నం చెయ్యాలి. ఈవెయ్యిరూపాయలు వచ్చేదాకా నిద్రపట్టదు.

(నిష్క్రమించును.)



రంగము:—[మందిరములో వెంకట్రామయ్యా సింహాచలము.]

సింహా—ఏమండీ! పంతులుగారూ! ఇదిగోవస్తానని అల్లాగేవెళ్ళి రెండు నెలలు చేశారేమండీ. మీారు ఒంటరిగా కలకత్తాకువెళ్ళితే యేదోకాస్త చిన్నకురుపువేస్తే అక్కడయెవ్వరూ లేకుండా ఆపరేషను చేయిస్తే మాపని యెలావుంటుంది, మాకెంతభయంగా వుంటుంది. ఏదోకురుపువేసింది ఆపరేషను చేయించేనని వ్రాసి

డమేగాని దానితప్పేలు యేమయినా వ్రాసినారా, అవును లెండి. నామీద ఆపేక్ష యెంతకువుంటుంది, మేమువిూతో మం కోరినవాళ్ళము గనుకనా.

వెంక—(తనలో) అన్నా వేశ్యలంటే సామాన్యులుకారు. వీళ్ళకు ఎంతడబ్బు ఇచ్చినా తృప్తియుండదు. నేనుపూళ్ళో లేనప్పుడిది యెవరో హైదరాబాదునుంచివస్తే ఆయనను రప్పించినదట. ఫిడేలు వాయించే శ్రీనివాసులుకి దీనికి యిలాకావుందట. నేనిది కర్ణాకర్ణికగా వినడమేగాని కళ్ళతో చూడలేదు. కాబట్టి యిప్పుడు దీనిని మందలించితే లాభంలేదు. అయినా ఒకతమాషాగా ఆసంగతి యెత్తుతాను.

సింహా—ఏమిటో ఆలోచించుచున్నారు?

వెంక—ఏమీలేదుగాని, ఆకలకత్తాచూచినమీదట యీవూరు మళ్ళీ చూస్తే నాకంతా అదియొకమోస్తరుగావుంది. పూరాగా డబ్బువున్నవాడు కలకత్తాలో వుండాలి. ఆవీధులేమిటి, ఆమేడలేమిటి మేడలోపలికి వెళ్ళినామంటే మళ్ళీయివతలకు రావడానికి దారితెలియక కొట్టుకొంటాము.

సింహా—ఎక్కడకువెళ్ళినా మీరే ఒంటరిగా వెళ్లుతారుగాని నన్నెక్కడికీ తీసుకొనివెళ్ళరు. ఖర్చుయిపోతుందని బెంగ.

వెంక—పాపము, ఖర్చుయిపోతుందని బెంగవుంటే 40 వేలుయిచ్చి మేడ యెల్లాకట్టించుతాను, 20 వేల రూపాయలుయిచ్చి వస్త్రాలు యెల్లా తెప్పించిపెట్టుతాను. ఇవన్నీ యియ్యగాలేంది ఇక కలకత్తా తీసికొనివెళ్ళితే ఖర్చుఅవుతుందీ. ఆలోచించకుండా ఏదో మాట అనేశెయ్యడమే.

సింహా—మాటవరసకన్నానుగాని మీకు యింతకోపమేమండీ, కోపమ

మీఁను మక్కామీద అడ్డబాస మోస్తరుగా వేలాడు తూవుంటుంది.

వెంక — నాకు కోపము యెప్పుడూ లేదు.

సింహా — పోనియ్యండి. ఇప్పుడా అనవసరమైనసంగతియెందుకు? నన్నేదైనా వూరు షోగ్గా తీసుకొనివెళ్ళండి. దగ్గిరేకదా. పోనీఒకసారి హైదరాబాద్ తీసుకొనివెళ్ళుతారా.

వెంక — (తనలో) ఈహైదరాబాదువ్యాపారం యెత్తుకొని నిమ్మళంగా రంగులోకి దింపాలి. (ప్రకాశముగా) ఏం హైదరాబాదుమీద మనస్సుపోయింది.

సింహా — ఏంలేదండీ. అక్కడవూరు చాలా బాగావుంటుందట. గొప్ప గొప్పమేడలున్నాయట. నవాబున్నాడు.

వెంక — అన్నీవున్నాయిగాని మడ్డిదేశం నాగరికతయన్నమాటపూజ్యం.

సింహా — యిక్కడవాళ్ళము అల్లా అనుకుంటాముగాని వాళ్ళుఖర్చుపెట్టినంత భాకీగా మనవేపువాళ్ళు ఖర్చుపెట్టలేరు.

వెంక — అవును. అక్కడవాళ్ళు అంటే గొప్పగొప్పమిరాసీదారులు, యినాందారులు, జాగీరుదారులు మొదలయినవాళ్లు యీ వూళ్లువచ్చి సానిదానింటికి సరసానికి వెళ్ళినారంటే రూ 500 లకన్న తక్కువయియ్యరట.

సింహా — (తనలో) ఇదేమిటిచెప్మా. ఈసంగతి యెత్తుచున్నాడు. నా రహస్యం యేమీ తెలియలేదుకదా. తెలిస్తే నానోట్లోమన్నే. (ప్రకాశముగా) అదంతావుట్టిమాట. ఒక్కరాత్రికి 500 రూపాయలు యెవ్వరుయిస్తారు. కాస్తవుంటే గంపంత చెయ్యడం మన వాళ్లకు సహజమే.

వెంక — నాకూ బాగా తెలియదుకాని, యీవూళ్లోనే ఒకభోగందానికి

రెవడో జాగీరుదారు 500 రూపాయలు యిచ్చినాడట. నిజమో అబద్ధమో.

సింహా—(తనలో) ఈయన నావిషయమై సంపూర్ణంగా తెలిసివుండే యిలా తమాషాగా అడుగుతున్నట్లు తోస్తూవుంది. కాని భగ వంతుడున్నాడు. అంతగా తెలిస్తే యేంచేస్తాడేమిటి. (ప్రకాశ ముగా) ఇల్లాటివదంతులన్నీ నాకేం తెలుస్తాయి. అస్తమానంఅదే వృత్తిమీద మీరువుంటారు గనుక మీకు తెలుస్తాయి.

వెంక—(తనలో) నిజంగా జాగీరుదారు దీనియింటికి వచ్చియుండాడా. ఇదివప్పుకొందా. నేనుయింతధనంయిస్తూ, యిన్నినగలు చేయిం చిపెట్టా, యింతమేడ కట్టించియిచ్చినానే. అల్లాటప్పుడు నన్ను స్వామిద్రోహంచేస్తుందా. దీనితల్లి చాలా పెద్దమనిషి ఒకవేళ కుఱ్ఱతనపుచేష్టలచేత యిది చెయ్యబోయినా అదిఆటంకం పెట్టుంది. కాబట్టి యీవ్యవహారం నేనునమ్మను. మా స్నేహంచూడలేక యిల్లాటితప్పు పెట్టామని యెవ్వరో వేసిన పుకారుగాని మరోటి కాదు. ఏబోగంముండో ఆసిలాచలమో యెవ్వరో వారు పుట్టించి వుంటారు. అంతేకాని ఇది యేమిటి అయిదువందలుకాదు ఆరువందలుయిచ్చినా మరొకరిని చేరనిస్తుందా. నేనునమ్మను నమ్మను.

వాకిట్లో—ఏమండోయి వెంకటాద్రియ్యపంతులుగారూ !

[వెంకటాద్రియ్యపంతులుగారు.]

వెంక—ఎవరువారు ?

[వాకిట్లో—నేనుగణపతిలాల్ని]

వెంక—కుఱ్ఱాడా తలుపుతీయరా.

[గణపతిలాలు ప్రవేశము.]

సింహా—(లోపలికిపోవును.)

వెంక—సరేలే. ప్రస్తుతం ఫ్రూళ్ళో లేరనిత్రిప్పెయ్యి. నీకు తెలియని దేము న్నది వాయిదా గడువుచాలదు మళ్ళీవాయిదా వేస్తారు. ఈలోపుగా ప్లీడరుకు కనుక్కొంటాను.

కోర్టు-జ—తమసెలవైతే అల్లాగే చేస్తాను. తమకోసం చాలాకష్టపడ్డాను.

వెంక—సరే ఈరూపాయిపుచ్చుకో. (రూపాయి ఇచ్చును)

కోర్టు-జ—బొత్తిగా చిన్నచూపుచూచినారు.

వెంక—పరవాలేదు నువ్వెక్కడికి వెళ్ళుతావు నేనెక్కడికి వెళ్లుతాను.

కోర్టు-జ—తమదయవుంటేచాలు. (నిష్క్రమించును)

వెంక—నెమ్మదిగా అన్ని కోర్టులో దాఖలుఅవుతున్నాయి మనపని త్రిసికట్టులోకి వస్తూవుంది

(వాకట్లో—ఏమండోయి—వెంకటాద్రయ్యగారూ)

వెంక—ఎవరోయిబాబూ.

[వాకిట్లో, నేను సబుకోర్టు ప్రోసెస్సుసర్వర్ని]

సబు-ప్రో—(ప్రవేశించి) ఏమండీ పంతులుగారూ మీకోసం పదిరోజులనుంచి తెగతిరుగుతున్నాను. మీకు అరెస్టువారంటువుంది తమరు కోర్టుకు రావాలి.

వెంక—దిక్కుమాలినఅవస్థ యేమిటిదీ. మార్వాడీ రామనాథు పెట్టించాడాయేమిటి?

సబు-ప్రో—అవునండీ

వెంక—సరేలే. దీనివిషయమై నేనుఅతనితో వేరేమాట్లాడుతాను కలకత్తా వెళ్ళినారని వ్రాసెయ్యి. ఇదిగో యీరెండురూపాయలు పుచ్చుకో.

సబు-ప్రో—చిత్తము. (పుచ్చుకొని వెళ్లును)

[సింహాచలం ప్రవేశించును.]

సింహా—ఏమిటండీ. షాతులుగారూ చాలామంది వచ్చివెళ్ళినారు వీరంతా యెవరు ?

వెంక—ఏముంది బాకీలవాళ్ళండీ. మరేం లేదు.

సింహా—మీరు ముందువెనుక చూడకుండా తెగఖర్చుపెట్టేస్తారు. ప్రతిచోట అప్పులు చేస్తారు. చూడండి యిప్పుడు వాళ్లువచ్చి గొంతుకమీద కూచున్నారు. ఎంతకష్టమో.

వెంక—కూర్చుంటే యేమిచేస్తారులే బాకీలు యియ్యలేకపోతే ఇన్సాల్వెన్సిపిటీషనువుందికదా. ఇప్పుడుచాలాడబ్బువున్న షాహుకార్లే ప్రయత్నించి అప్పులుచేసి ఆస్తిఅంతా పెళ్ళాముపేరబెట్టేసి కోర్టుకువెళ్ళి దివాలాపిటీషను దాఖలుచేస్తున్నారు. కాబట్టిమన బాకీలవిషయమై నీవుయేమీభయము పొందవలసినపనిలేదు.

సింహా—దివాలాపిటీషను దాఖలుచేస్తే పరువుపోకుండా పరపతిపుట్టుతుందా. ఇది యిల్లావుండగా అవతలవాళ్ళు ఖైదులో పెట్టిస్తే మర్యాదపోదా ?

వెంక—సివిలుఖైదుకున్నూ, క్రిమినలుఖైదుకున్నూ చాలాభేదంవుంది. సివిలుఖైదీకి అయ్యేఖర్చులన్నీ అవతలవాడే ముందుగా దాఖలుచెయ్యాలి. సంకెళ్ళుగింకెళ్ళు యేమీవేయరు. ఏదోఒకనెల చూస్తారు ఇల్లా ఖైదులోపెట్టితే సిగ్గుచేత యిస్తాడేమో అని చేస్తారు మొండివాడయితే వదిలివేసిఒకనమస్కారము చేస్తారు.

సింహా—మీకెపుడులో మాచెడ్డప్రాణాలున్నాయండి. రండి. చాలా పొద్దెక్కుతుంది. మీరింకా భోజనానికి వెళ్ళిరావాలి.

వెంక—ఈవాళ నేను హోటలుకువెళ్ళలేను. ఇక్కడికే భోజనం పంపమన్నాను. ఇంకా స్నేహితుడి బ్రాహ్మణకుర్రవాడే యిక్కడకు పట్టుకొనివస్తాడు.

సింహా—మీరు వెళ్ళేదయేమిటి. రోజూవచ్చేటట్టు అల్లాయేర్పాటు చెయ్యండి. తెచ్చినందుకు ఒకరూపాయి యెక్కువ యియ్య వచ్చును.

వెంక—అల్లాగేచూడాలి. లేకపోతే యీమూలనుంచి ఆమూలకు వెళ్ళ డంచాలాకష్టగావుంది. కానిచూతాం. ఈవాళగడిచిపోనియ్యి రా. త్వరగాభోంచేసి ప్లీడరుగారియింటికికూడా వెళ్ళాలి.

(నిష్క్రమింతురు.)



[రంగము:—సింహాచలము:—చంద్రివదన.]

చంద్రి—ఇదేమిటె అమ్మాయీ. చూస్తూచూస్తూవుండగానే యిల్లా అయింది. మన వెంకటూమయ్యగారు మంచం యెక్కినారు. గుం డెలన్నీ యెండిపోయినాయి. డాక్టర్లకు యెంతమందికి చూపిం చినా కార్యంలేదని చెప్తూతున్నారు.

సింహా—భగవంతుడు చేసేదానికి మనము కర్తలమా ! చాలారోజుల నుంచి నన్నుకనిపెట్టివున్నారుగనుక యీసమయంలో మనం కాస్తడబ్బుకు లోభించకుండా వైద్యంచేయించాలి. లేకుంటే మనమూరుకొన్నామంటే యెటుబోయి యెటువచ్చినా అపవాద మనకు వస్తుంది.

చంద్రి—నువ్వన్నమాట నిజమే. నిన్నవచ్చిన డాక్టరుగారు గుండెలన్నీ తనిఖీచేసి అతితాగుడుచేత ఖలేజాఅంతా తినేసింది. మందు వల్ల మాత్రలవల్ల లాభంలేదు అన్నారు.

సింహా—అంతేకాకుండా, నేనుపైగాతిరిగేవిషయం ఆయనకు బాగా తోచింది. రెండుమూడుసారులు ఆయనగదిలోనికి వచ్చేటప్ప టికి శ్రీనివాసులు నేనూ తలుపు వేసుకొని కూర్చోటం ఆయన బాగాచూచినాడు. దీనిచేతకూడా ఆయనకు యీజబ్బుకుతోడు బెంగఅధికమైపోయింది. ఆయన సాధారణంగా బ్రతుకు

యీచంద్రవదనసూత్రుడు సౌందర్యంఅనేటువంటి మోహసా గరంలో పడిపోయి తాగుడుకు అలవాటుపడి సమస్తమయిన ఆస్తిపాడుచేసి తుదకుజాడ్యగ్రస్తుడనైతిని. ఎంతధనముయిచ్చి నను వేశ్యలుఒకనిని నమ్మియుండరని నాకు బాగా తెలిసింది. నేనుపాడవడానికి సింహాచలమే కారణము. ఇప్పుడేమన్ననులాభ ములేదు. అదినామీద అనురాగంచూపిందల్లా డబ్బులాగడం కోసం అని నేను తరువాత తరువాత అనుకొన్నాను. నేనెంతడ బ్బుయిస్తూవున్నా తృప్తిపొందక యితరులంగూడుట కన్నులార చూచినాను. విశ్వాసంకలదని నేనెంతసొమ్ముడబ్బు దీనికిచ్చినాను ఇంతయేల. నాయాస్తిపాడవడానికి యిదేకారణం. వళ్ళూ, నై తెలియకుండా తిరిగిన నావంటినిర్భాగ్యుడిల్లాటి స్థితిపొందవలసిన వాడే, అనేకులు వేశ్యలవలనపాడైనారను సంగతి తెలిసివుండీ కూడా యిల్లా అయిపోయినాను. "మహాసముద్రముయొక్క లోతయినా తెలుస్తుందిగాని వేశ్యామోహ సాగరానికి మాత్ర ము లోతు తెలియదు. ఇదిమహాఅగాధము. వేశ్యలను వుంచు కొన్నవాళ్ళు యెవ్వరూబాగుపడలేరు. అంతాదుర్మరణాలే చెంది రు. ఈవేశ్యలకు కరుణయన్నదినాస్తి. సంతోషము భూలో కము. నిశ్చలమైనమనస్సు నుంటేకద్దు. నిశ్చలమైనచిత్తం సున్న. వావివరుసలు పూజ్యం. అనురాగంచుక్కెదురు. కంచు కాగ డా వేసి చూచినా గానికడుపులోయెక్కడా ప్రేమవుండదు. వీరితో మైత్రి ధననాశనంబగుటయేగాక ప్రాణనాశనంబుకూడనగును. అగ్నిహోత్రునిసాక్షిగా పెండ్లాడిన భార్యనువదలి ఈవేశ్యలను జేరినవారిబ్రతుకు లిట్టివే. ఈవేశ్యలుండుటచేతనే పెక్కుండ్రు పురుషులు పాడయిపోవుచున్నారు. సంఘసంస్కరణ పరాయ ణులు వేశ్యలవిజృంభణమునాపి వీళ్ళనుగూడ సంసారులనుజేసి,

తక్కినవారలములతోపాటు వివాహములు చేసినచో బాగుండును.

జగ—తమ్ముడా! ఈబుద్ధి మొదటనే వుంటే యిన్ని యవస్థలువస్తాయా.

వెంక—అన్నయ్యా! ఏదేహికైనా అవాలో ఉల్లాగవకతప్పదు. అంతా భగవద్వశం ఇప్పుడిక చింతింపబనిలేదు. నేనుబ్రతుకుట అసత్యము. కాబట్టి నామాటవిని అన్నయ్యా, నాయందు దయవుంచి నేనుచెప్పినట్లుచెయ్యి. నాకువుంచుకొన్న ఆస్తిఖరీదుకట్టిన యెడల మొత్తముగా లక్షరూపాయలవును. అందులో 63 వేలు అప్పులకుపోను. ఇక 37 వేలలోను 7 వేలరూపాయలు వేశ్యాపిల్లలకు వివాహాలనిమిత్తమిచ్చి 25 వేలు నాభార్యకిచ్చి కుమారుడిని దత్తతచేసుకొమ్మనిమ్ము. తక్కిన అయిదువేలును నావిషయమై ఖర్చుచెయ్యి. నాభార్య సాధ్విగనుకనే నేనిట్టియకార్యములు చేయుచున్నను సైరించియూరకున్నదిగాని మరొకరైనచో యింతసేపు కేసుల్యో గీల్యో చూచుకొనియే యుండును. నీవు నాయందు దయవుంచి దానితో "ఇంతధనవంతుడినైయుండి నీమొగము చూడక వేశ్యమాయలోబడి బ్రతికియుండియు నిన్ననాథగా నల్పినపాపుడను. నీవునావిషయమై విచారింపక యన్నగారు చెప్పిన ప్రకారముండి తనువు నిల్పుకొనుము. ఆ సొమ్మును ఇరువదైదు వేలను నీవు అనుభవింపగలవు. అది జాగ్రత్తగా వడ్డీకి వేసికొంటే కావలసినంతగును. నీవొకపిల్లవాడిని నాఅన్నగారు చెప్పినవానిని పెంచుకొని నేనెంతదుర్మార్గవృత్తిగాని చరించినను నాపేరు నిలబెట్టుము" అనిచెప్పితినని చెప్పుము. అన్నయ్యా నీకు సమస్తము తెలిసేవుంది. నేను చెప్పవలసినవాడిని గాను. దానినిరక్షించే భారమంతానీది. ఈఆస్తులవిషయమై క్రమమైన స్టాంపుమీద నీలువ్రాస్తాను.

జగ—తమ్ముడా నీవ ధైర్యపడకుము.

శౌంక—అన్నా ఇంకా వైద్యమేమిటి? కాలదండము పుచ్చుకొని యముడునన్ను తీసుకొని వెళ్ళడానికి సమయంకోసం కనిపెట్టుకొని వున్నాడు గుండెల్లో మాదడగాన్నుంది. నాలుకఆర్చుకొని పోతూవుంది.

జగ—నేను వెళ్ళి ఢిల్లాసర్జనుగారినైనా తీసికొనివస్తాను. మరేం భయపడకు. (అందరు నిష్క్రమింతురు.)



రంగము:—[మోహిని—అలివేని—మందిరములో ప్రవేశము.]

మోహిని—అలివేని! రోజూమనయింటికి సంగీతం చెప్పకోడానికివచ్చే ఆకోమట్లమ్మాయి రాలేదేమి? రోజూయీపాటికల్లా వచ్చేదే!

అలి—వస్తుంది. పిల్లకాదా వపిల్లలన్నా ఆడుకోడానికివస్తే ఆటపాటని పడ్డదేమో.

మోహి—నేనోకరహస్యం చెప్తాను. నీవు కాస్తున్నా బయలుపెట్టకుండావుండాలి. బయలుపడ్డవంటే మనప్రాణాలుదక్కవు. ఈ కార్యం మనంచేస్తినా మనకు చాలాడబ్బువస్తుంది. ఎంతమందిదగ్గరికు వెళ్ళి ఎన్నిరూపాయలు తెచ్చుకొంటే పదివేలురూపాయలవుతాయి.

అలి—డబ్బులాభించే పనిఅయితే యెల్లాటిపనిఅయినా చేదాము.

మోహి—నేననుకొన్నపని సామాన్యమైనదిగాదు. మహాసాహసంవుండాలి. ఈరహస్యం మనయిద్దరిలోనే వుండాలిగాని మూడోకంటికి తెలియకూడదు.

అలి—ఎందుకు తెలుస్తుందిలే. జాగ్రత్తగానే చేయవచ్చును. అదియేమిటో చెప్పు?

మోహి—నీవుయెవ్వరితోనూ వెల్లడిచేయనని యిల్లాటిపని నీతోకలిసిచేదామని చెప్పుతున్నాను. గనుక నీవుకూడ మహాజాగ్రత్తగా

చూడాలి. ఏమిటనగా, మనయింటికివచ్చే కోమట్లఅమ్మాయిని, చూచినావా?

అలి—చూచానే. రోజూచూస్తూ నేవున్నాను.

**మోహి**—అదికాదే. వంటిమీద యెన్నినగలున్నాయో,

అలి—వడ్డాణం, పుస్తెలతాడు, బంగారపుతాడు, కట్టెడపు కాసుల పేరు, గజ్జెలపట్టెడ, ముఱుగులు, ముఱుగులోలుసులు, కంటె, బోజాలు, వంకీలు, యింకాయేమిటో చాలావున్నాయి, అన్నీ రాసువేలరూపాయల ఖరీదుగల వస్తువులున్నవి, అయితేనేం

**మోహి**—అవిమనకు యెల్లాగయినా సంగ్రహించాలి.

అలి—ఇదా నీవు డబ్బులాభంఅని చెప్పినావు. ఆ అమ్మాయివంటిమీద నగలు మన కెల్లావస్తాయి. అందనివళ్ళకు చేతులుచాపితే ఏంలాభంవుంది?

మోహి—ప్రయత్నంచేస్తే రాకేంచేస్తాయి.

అలి—ఏలాగ ప్రయత్నం చెయ్యాలి. నా బుద్ధికినిపిల్లనుకునా. మొహ్హోవి తెంపుకొని సాగనంపడానికి.

**మోహి**—ఇల్లాటిపెద్దిఖాయిలంకాదు. (ఇటూఅటూచూచి) ఎవ్వరూలేరు గదా. విన్నారంటే కొంపమునుగుతుంది. గుప్పచుప్పగాకుండా పిల్లను చంపడమే.

అలి—అయ్యబాబో నువ్వు ఆమాట అనేప్పటికే నా కాళ్ళల్లోనుంచి వణకుపుట్టుకొని వస్తూవుంది. దిక్కు-మాలినడబ్బు లేకపోతేపోయిందిగాని యిల్లాంటిపని చేసినామంటే ప్రాణాలువుంటాయా. ఇల్లాటివిదాగుతాయా. అమ్మయ్యో! మోహనీ నీకు యీలా బుద్ధి పుట్టిందేమి? ఇల్లాటిప్రాయాలు యెప్పుడూ మనస్సులో పెట్టుకోకు. కొంపలు మునుగుతాయి.

మోహి—నీవెక్కడో వెర్రిమొగఃలావున్నావు. మనయింట్లో గదిలో గుప్పుచప్పుగాకుండా చేసేయీపని యెల్లాబయలుపడుతుంది? నీవావిషయమై సందేహించవద్దు. కావలసినంతడబ్బు గుభాలుమని చేతిలోపడుతుంది. యెన్నాళ్లినఃపాయిస్తే యింతడబ్బు వస్తుంది. నీవేమీ భయమున్నూ అనుమానమున్నూ పడవద్దు. దీనివిషయమై నేను తగినప్రయత్నంచేస్తాను.

అలి—యేమోగాని యిల్లాంటిపనిచెయ్యడానికి నామనస్సొప్పుకోవడు లేదు. యిదిచాలా పాపమని భయమేస్తూవుంది.

మోహి—పాపమనా నీకుభయమేస్తూవుంటా! పిచ్చిదానా మనంచేసేపనులన్నీ పాపంగాదా. లంజతనంచెయ్యడంపుణ్యమేనా యేమిటి? ఇల్లాఆలోచిస్తే జగంలో మనం యేపనిచేయలేము. లోకంలోనివాడికి తెలియకుండా యీపని మనము చేస్తాము.

అలి—నేనేం చెప్పగలను. డబ్బులేకపోతే ముష్టెత్తుకోవచ్చును గాని యిల్లాంటిదారుణపుపనులుచేస్తే చాలా పాపమేకాకుండానలుగురులో తలయెత్తి బ్రతుకలేము. కాబట్టి నీవు నామాటవిని యీపూనికమానివేయి లేదా తరువాత నీయిష్టము.

మోహి—ఈవిషయంలో నీవు నామాటకెదురుచెప్పకు నీకేమీభయం లేదు. నీప్రాణానికి నాప్రాణం అడ్డువేస్తాను.

అలి—ఇకనీయిష్టము. నీకునేనుయెదురుచెప్పలేనుకాని యీదారుణహత్య మనయిద్దరివల్ల అవుతుందాఅని సందేహంగావుంది. మనము ఆడవాళ్ళము.

మోహి—నీకాసందేహం. అక్కరలేదు. నేను మనమడ్డిలజోమన్నతో మాట్లాడినాను. అతనికింమలో వాటా యిస్తానన్నాను. వాడు వప్పుకొన్నాడు.

అలి—కాని బహుజాగ్రత్తగాచేయాలి.

మోహి—అదుగో ఆకోమట్ల అమ్మాయి లక్ష్మమ్మ వస్తూంది. ఈపరి సంశ యేమీయెత్తకు. ఈపిల్ల భోంచేసి వచ్చినట్లున్నది. పర వాలేదు. కూర్చోబెట్టి నెమ్మదిగా సంగీతం చెప్పుతూవుండు. సోమన్నను పిలుచుకొనివస్తాను. చేయదలంచుకొన్న కార్యం యిప్పుడే చేసెయ్యవచ్చును. (నిష్క్రమించును.)

అలి—(తనలో) నాహృదయంలో యిల్లాటి తుచ్ఛపుకోరిక లేకపోయినా యీపిల్ల వంటిమీది వస్తువులు చూచేటప్పటికి నాకూ ఆశలు పుట్టింది.

[లక్ష్మమ్మ ప్రవేశము.]

అలి—అమ్మాయీ వచ్చావుగా! దా అమ్మా.

లక్ష్మ—మోహిని యేది?

అలి—వస్తుంది కూచో. పాఠం వల్లించావా!

లక్ష్మ—ఓమోస్తరుగా వచ్చింది. రాత్రి పాడుకుందామనుకొంటే మా యింటికిదొకరో బంధువులు వచ్చినారు. వారు భోజనాలుచేసి వెళ్ళే సాటికి నిద్రలో పడిపోయినాను. కాస్త తెల్లవారుజామున లేచి చదివినాను.

అలి—ఏదీ పుస్తె చదివించు చూదాం.

లక్ష్మ—పుస్తకం మరిచిపోయినాను యింటివద్ద పెట్టి.

అలి—పోనీలే. ఆగీతము మోహినికి వచ్చును. అది వస్తుంది వుండు.

[మోహిని ప్రవేశము.]

అలి—అదుగో మీ మోహిని వచ్చింది. ఇంక నీ యిష్టము. దాని యిష్టము.

మోహి—ఇదేమిటి లక్ష్మమ్మా! చావిట్లో కూర్చున్నావు. గదిలోకి పదా.

లక్ష్మ—ఎక్కడైనా తేనేమి కూర్చున్నాసరే.

మోహి—నీవుమాటలు మహానేర్చావు పదవో. (గదిలోనికి తీసుకొని వెళ్ళును.)

లక్ష్మి—నువ్వెక్కడికి వెళ్ళినావు ?

మోహి—కొద్దిగాపనిమీద వెళ్లినాను. నువ్వెంతసేపయిందేమిటివచ్చి?

లక్ష్మి—ఇప్పుడే వచ్చినాను.

మోహి—ఏం ఈవాళ చాలా ఆలస్యంచేశావు ?

లక్ష్మి—తలకు నీళ్లుపోసుకొని భోంచెయ్యడం ఆలస్యమైనది.

మోహి—అందుకనే తాంబూలం జాడించావు.

లక్ష్మి—ఏమిటో భోంచెయ్యగానే అలవాటు.

మోహి—పొద్దున్నే అప్పుడే వంట అవడం భోంచెయ్యడం కూడా అయింది. యేమి వేసుకొనితిన్నావు ?

లక్ష్మి—ఏముంది. కందిపచ్చడి, వంకాయకూర, వుల్లిపాయపులుసు.

మోహి—మీకోమట్లకు ఉల్లిపాయఅంటు బహిష్కారింంగదా.

లక్ష్మి—మీరు తినరా యేమిటి ?

[సోమన్న ప్రవేశము.]

సోమన్న—ఏం మోహినీ.

మోహి—అంతా సిద్ధంగా నేవుంది.

లక్ష్మి—సిద్ధంగా వున్న దేమిటి ?

మోహి—వేరేసంగతిలే. (సోమన్ననుచూచి కన్ను గీటుచున్నది.)

సోమ—(గదిలోకివచ్చి) కోమట్ల అమ్మాయా ఏమిటి! సంగీతం నేర్చుకోవడానికి వస్తూవుంటుందా యేమిటి? ఈఅమ్మాయికి పెళ్లి అయిందా ?

మోహి—అయింది.

లక్ష్మి—నేను వెళ్ళిపోతాను తరువాత వస్తాను.

మోహి—సిగ్గుపడకు మట్టులవాయించే అతడేలే.

సోమ—అమ్మాయి వంటిమీద చాల నగలున్నా యే. (లక్ష్మమ్మను చూచి) అమ్మాయీ! యిన్నినగలు నీవు మోయలేవు. నాకు యిచ్చివేద్దూ. నీపేరుచెప్పుకొని హాయిగా వేసుకొంటాను.

అలి—ఆపిల్లను అల్లామాట్లాడించకు సిగ్గుపడుతుంది.

సోమ—అయ్యోబాబో. ఇల్లాసిగ్గుపడేపిల్ల రేపు మొగుడుతో కాపురము యేలాచేస్తుంది.

లక్ష్మ—ఇదేమిటి మోహినీ. ఈలాటి మాటలంటాడు యితడు. నేను వెళ్ళిపోతాను.

మోహి—వెళ్ళవచ్చును లేవమ్మా. వెళ్ళి యింటికాడ ఏంచెయ్యాలి. (తలుపు దగ్గరసా వేయును.)

అలి—సోమన్నా! వీధితలుపు వేశేవుంటావా?

[సోమన్న కూడా గదిలో ప్రవేశించును.]

లక్ష్మ—ఇదేమిటి తలుపుదగ్గిర వేశావు. ఇతడుకూడా లోపలికివచ్చి నాడు యెందుకు?

మోహి—నీకోసమే.

లక్ష్మ—ఇల్లాటిమాటలన్నావంటే నాకు కోపంవస్తుంది. నేను వెళ్ళి పోతాను.

మోహి—మావలలోచేపచిక్కినట్లు చిక్కినావు. ఎక్కడికి వెళ్ళగలవు?

లక్ష్మ—నన్ను వెళ్ళనియ్యవా యేమిటి.

మోహి—వెళ్ళనియడానికి గదిలోనికి తీసుకొని రాలేదు.

సోమ—(కత్తిచూపి) ఆనగలుతీసి అక్కడపెట్టమను త్వరగా.

మోహి—లక్ష్మమ్మా. ఆవస్త్రాలుఅన్నీ తీసి అక్కడపెట్టు.

లక్ష్మ—(తనలో) వీళ్లు నావస్త్రాలు తీసుకోవడంకోసం కాబోలు నెమ్మ దిగా యీగదిలోనికి తీసుకొనివచ్చినారు. వస్త్రాలుయియ్యక

పోతేచాపుతాకేమోకదా. నాకెందుచేతనోవళ్ళంతాబిగుసుకుం

టూవుంది. (ప్రకాశముగా) నావస్త్రములు మీకెందుకు?

సోమ—మాకుకావాలి. తక్షణంతీశెయ్యి. ఇకనిన్ను వదలము. వస్త్ర

ములుతీసుకొని నిన్ను నఫాచేయడానికే తీసుకొనివచ్చినాము.

లక్ష్మి—(తనలో) అన్నా పిల్లునన్ను చంపేసినగలు వల్చుకోవడంకోసం

ఖిల్లాచేస్తున్నారు. (ప్రకాశముగా) నేనువూరుయింటికి వెళ్ళు

తాను నన్ను వెళ్ళనీయండి.

సోమ—మోహినీ. చూస్తావుయేమిటి? ఆలస్యంచేసినకొలదీ మనకు

కష్టము. మెళ్ళోవున్నవన్నీ జెమ్మదిగా కత్తిరించండి. తరువాత

గొంతుక్కాయమీద ఒకవేటువేస్తాను.

మోహి—(లక్ష్మమ్మమెడలో చేయిపెట్టి బలవంతంగా వస్త్రములుతీసు

కొనును.)

లక్ష్మి—నావస్త్రములు మీకుయిస్తాను. నన్ను ప్రాణాలతో వదలివె

య్యండి. మీకుదణ్ణాపెట్టాను.

సోమ—నిన్ను వదలివేస్తేమాకొంపతీయవ్వా.

మోహి—గట్టిగామాట్లాడకు.

సోమ—ఇంకాఆలోచనయెందుకు (కత్తియెత్తును.)

లక్ష్మి—అయ్యో! నన్నుచంపకండి. రక్షించండి. మీకాళ్ళు పట్టు

కొంటాను.

సోమ—కేకలువెయ్యకు. (పట్టుకొనగా గింజుకొనును.)

మోహి-అలి—కాళ్లుచేతులు పట్టుకొందురు.

లక్ష్మి—బాబో. బాబో.

సోమ—(నఱుకును.)

మోహి—చచ్చింది.

అలి—రక్తం పరివాహం ఎక్కువగా కారుతూవుంది. ఇప్పుడీ మొండేలు యెక్కడదాద్దాము?

మోహి—ఇప్పటికి అటుకుమీదబెట్టి రాత్రి రెండుఝాముల అప్పుడు పాతివేద్దాము.

సోమ—సరే అట్లనే చేదాము.

(నిష్క్రమింతురు.)



(రంగము—మోహినియింటివద్ద—పోలీసుయినస్పెక్టరు పోలీసు కాన్స్టేబిలుసాహెబు)

పో-ఇ—ఏమోయిజవానూ. పాపమా కోమట్లమ్మాయి పొద్దుట నుంచి యిప్పటివరకు కనబడడంలేదట. మనఆఫీసుకు రిపోర్టు యిచ్చినారు. దానిమీద రెండు వేలరూపాయల నగలున్నాయట పాపము. నాకుచూడగా యెవరైనా ఆవస్తువులకోసం ఆశపడి అవితీసుకొని చంపేశారని తోస్తూవుంది. ఆ అమ్మాయి సాధారణంగా రోజూ వెళ్ళేయిళ్ళన్నీ సోదా చేసినాము. కానిఆచోట యేమిజాడదిక్కు లేదు. ఈభోగందానికి రోజూ పాట నేర్చుకోడానికి వస్తూవుంటాదట. ఇక్కడకూడా చూదాం.

కా-సా—హుజూర్ దండిమహారాజ్ వీళ్ళకీకంచనులు బడాబడామాదర్చోదులు. వీళ్ళకియెంతపని చేసినాచేస్తారు. నాకుయీవాళ్ళమీదే నిండా అనుమానంవుంది. ఇప్పుడు మనము అంతాపరీక్ష చేస్తే సంగతి తెల్లమౌతాది.

పో-ఇ—సరే. లోపలికి వెళ్ళుదాము. తలుపుతీయుమని పిలువు.

కా-సా—లోపలా యెవరూ. దర్వాజా తీయండి. (తలుపుకొట్టుచు కేకలు వేయును)

మోహి—(తలుపుదీసి) ఎందుకండీ. సాయాబుగారూ ?

కా-సా—ఏమనుకొండీయేళ్లిరా. అందుకనే. దాకొలెగు ఇన్స్పెక్టరుసాబ్ వచ్చినారు. జల్దీ మీాయిల్లు సోదా సెయ్యాల. మీాయింటికి సంగీతం సెప్పుకోడానికి వచ్చేకోళ్లిరాకట్లున్ని యిమ్మాలపొద్దు గురించి కన్పించడం లేదు.

మోహి—ఈ వాళమాయింటికి సంగీతం చెప్పుకోడానికి రానేలేదు. (ఇనస్పెక్టరుగారినిచూచి) దండాలండీ. (తనలో)అయ్యో ఇప్పుడే మిచెయ్యను. నటీకిన మొగుడెనులు రాత్రియెక్కడనన్నా పాఱ వేద్దామని అనుకుంటూవుండగానే పోలీసువారువచ్చారు. అక్కటా. ఇప్పుడేమిచేయును. అయినా ఆపిల్లను నటీకినగదికి తాళం వేశానుగదా. పోలీసువారు ఆచలిస్తే పేగులు లెఖపెట్తారు. భగవంతుడిదయవల్ల గుట్టుబయలుపడకుండా వుంటేసరిగాని లేకపోతే మాందరిపాణాలు పోయినట్టే. ఆరోజే యింతవద్దని బోధించినాగాని వినకుండా యింతదారుణహత్య యెందుకుచేశానోగాని భగవంతుడా ! యిప్పుడు సిన్నరక్షించాలి. సోమాలమ్మతల్లీ! ఈగండంగడిస్తే నీకుచీరాపసుపు కుంకంవచ్చేవారం పట్టుకొనివచ్చియిస్తాను.

పో-ఇ—నీవేనా యీాయింటికి యజమానురాలవు?

మోహి—అవునండి.

పో-ఇ—నీదగ్గరసంగీతం చెప్పుకోడానికి రోజూ యెంతమంది వస్తావుంటారు ?

మోహి—నేను యెవ్వరికీచెప్పడం వృత్తిగాపెట్టుకోలేదు. ఒక్కరోసు ట్లలఅమ్మాయిమాత్రిం ప్రతిరోజూసరదాకు పాటలునేర్చుకోవడానికి వస్తూవుంటుంది.

పో-ఇ—ఆ అమ్మాయిపేరు ఎవరు ?

మోహి—లక్ష్మమ్మ.

పో-ఇ—ఆ అమ్మాయి యీవాళరోజున పొద్దున్న మీయింటికి వచ్చిందా ?

మోహి—నేను పొద్దున్నయింట్లో లేను. కొద్దిగాపనిమీద వెళ్ళినాను.

పో-ఇ—ఇప్పుడుబంటోత్తుతో ఆపిల్ల యీవాళమాయింటికేరాలేదని చెప్పినావే.

మోహి—నేను చూడలేనుగనుక రాలేదనుకొన్నాను.

పో-ఇ—నువ్వుయింట్లో లేనప్పుడు యిల్లుతాళంవేసి వెళ్ళినావా. లేక యింట్లో యెవ్వరన్నావున్నారా.

మోహి—మావాళ్ళే. అలివేణి అని యింట్లోవుంది.

పో-ఇ—ఇప్పుడది యేది ?

మోహి—యింట్లోవుందండి.

పో-ఇ—సాహెబు దానిని పిలుచుకొనిరా.

కా-సా—అచ్చా. (లోపలికి వెళ్ళి అలివేణితో ప్రవేశించును)

అలి—(ఇనస్పెక్టరుగారినిచూచి) దండాలండి.

పో-ఇ—పొద్దున్నమీయింటికి లక్ష్మమ్మ అనే కోమటిపిల్ల పాటనేర్చుకోడానికివచ్చిందా?

అలి—(తనలో) కొంపతునిగింది. అయ్యోబాబో యిప్పుడేం చెప్పను. (ప్రకాశముగా) వచ్చిఅప్పుడే వెళ్లిపోయింది. ఈవేళ అట్టేసేపు కూర్చోలేదండి.

పో-ఇ—అప్పుడు మోహిని యింట్లోవుందా.

అలి—ఆ అమ్మాయి వచ్చేటప్పటికి మోహిని యేదోపనిమీద వెళ్ళివచ్చింది. మోహినిరాగానే యీపూటమాయింటికి యెవ్వరో బంధువులువచ్చినారు అనిచెప్పేసి వెళ్ళిపోయింది.

పో-ఇ—ఎవ్వరితో చెప్పింది?

అలి—మాయిద్దరితోనూ చెప్పింది.

మోహి—(తనలో) ఇదికొంపతీసింది.

కా-సా—దేఖో. మహారాజ్. ఏకంచర్ కైసాబోల్తే బడాఅద్మే.

పో-ఇ—మీరాపిల్లను యేంచేసినారో అనిమాకుపూరాఅనుమానంగా వుంది.

మోహి—ఆపిల్లను మేమేమిచేశాముండి. సరదాకు కాస్తపాట చెప్పమని వస్తూవుంటే చెప్పుతున్నాము.

పో-ఇ—ఆపిల్లసాధారణంగా మీయింటికి తప్ప మరెవ్వరియింటికి వెళ్ళదట. కాబట్టి నిజంచెప్పండి. మీరు నిజంచెప్పకపోయినా మేముకనిపెట్టగలము. మాకుశ్రమయియ్యకుండా చెప్తేమాకు చాలాసంతోషముస్తుంది.

కా-సా—సర్కార్. వీళ్లే ఆకురద్రీదాన్ని మర్గయాచేసివుంటారు మన ములోపల్కి వెళ్ళిసూద్దాం.

పో-ఇ—మమ్మల్ని లోపలికి వెళ్ళనియ్యండి. మేముదొడ్డీయిల్లుఅంతా సోదాచేయాలి.

మోహి—అనుమానంవుంటే చూసుకోండితల్లి. మాకేంభయంవుంది.

పో-ఇ—(లోపలను దొడ్డియు వెతకివచ్చితాళమువేసివున్నగదినిచూచి) ఈగదితాళంకూడా తీయండి.

అలి—(తనలో) అయ్యో అయ్యో! ఇంకేముంది కొంపమునిగిపోయింది

మోహి—ఈగది మాకిందలేదండి. ఒకఆడమనిషి ఇందులో అద్దెకు వుండేది. సామానులన్నీలోపెట్టుకొని తాళంవేసుకొని వెళ్ళింది.

కా-సా—జూటాబాత్ సర్కార్.

పో-ఇ—ఆడమనిషి అద్దెకుండటంలేదు గిద్దెకుండడంలేదు మాకు తాళంబద్దలుకొట్టి చూడటానికి అధికారంవుంది నీవు దీనితాళం తీస్తావా! మేము బద్దలుకొట్టమా!

కా-సా—సార్. నాదగ్గిర దీనికి సరిపోయేతాళంవుంది.

పో-ఇ—వుంటే తియ్యి చూస్తాం యెందుకు?

కా-సా—(తీయుచున్నాడు)

మోహి—అందులో సామాను యేమయినాపోతే అడ్డెకువున్న మనిషి మామీద పెట్టుతుందండీ.

పో-ఇ—పర్వాలేదు. (తలుపుతీసుకొని లోపలికివెళ్ళి) సాయీబూ ఇక్కడ నేలమీద రక్తంకారినట్లున్నది.

మోహి—(తనలో) ఇంకేముంది. కొంపమునిగింది.

కా-సా—(స్థలముపరీక్షించి) హాం. మహారాజా! ఇక్కడమనిషిని చంపినట్లుకనపడుతూవుంది. (అటుకుకేసి పరీక్షించిచూచి) దేఖో మహారాజ్. పైనుంచిరక్తపుచుక్కల్ పడుతున్నాయి.

పో-ఇ—అవును. సాయీబూ పైకెక్కి చూడు.

కా-సా—ఏకంచక్ సేకొంపమునిగిందిరా నిచ్చెనతీసుకొనిరా.

మోహి—పైనయేదన్నా పిల్లిపిల్లి దెబ్బతగిలి చచ్చిందేమోనండీ.

పో-ఇ—ఎవిచస్తే నేమిలే. ముందు నిచ్చెన తీసుకొనిరా, అట్టేచూడ్లో డకు (సాహేబును జూచి) సాహేబ్ ఇంట్లోవాళ్ళు అవతలికి వెళ్ళిపోకుండా వాకిట్లో పోలీసుజవానులున్నారా !

కా-సా—హాంజీ మహారాజ్.

మోహి—(తనలో) నాకు వినాశకాలం సమీపించడంచేతనే యిట్టి దారుణపుపనిచేసినాను. ఇంక నాకు చావుతప్పదు. (నిచ్చెన తెచ్చి యిచ్చును.)

కా-సా—(నిచ్చెనపైనుంచి పైకెక్కి) మహారాజా ! విశ్వబడే బాయిలు కార్యంచేశారు. ఆడపిల్లే దీన్ని-నంపి రెండుముక్కలేసిదీనిమీద దెచ్చంచినారు.

మగవాళ్ళకును మనకును ననేకదుర్బుద్ధులుపుట్టును. కాబట్టి యింతటినుంచి మనపిల్లలకు చక్కగా వివాహములుచేసి సంసారులుగా నొనర్చ సుఖించండి.

పోలీసుబంట్రోతు—ప్రవేశించి ఇంకేమి. మిమ్మల్నందరిని ఈవేళ రైలు యెక్కించాలి. (తాళముతీసుకొని పోవును.)



రంగము:—[నీలాచలముగారిల్లు:—ప్రవేశము శ్యామసుందరరావు సాహేబు వేషముతో]

శ్యామ—(తనలో) అప్పుడు చంద్రవదనకూతురుకు వెయ్యిరూపాయలుదండగ పెట్టినాను. కానిమనకు నగలు అక్కడఏమీచిక్కలేదు. ఈనీలాచలంవంటిమీద పదివేలరూపాయల నగలున్నాయి. దీనికి యిప్పుడు పదిహేనువందరూపాయలు యిస్తానని చేసినాను గదా. నెమ్మదిగాదీనికి కాస్తసరుకు పూటుగాపోయించి మెళ్లో వున్నవాలుగు తీసుకొని చక్కాపోతాను.

[నీలాచలం ప్రవేశం.)

నీలా—సాహెబుగారూ ఏమిటి ఆలోచిస్తున్నారు?

శ్యామ—ఏముంటాది నీయొక్కచందంచూచి మాకుప్రాణసంతోషం చేస్తూంది. నీలాంటికంచాని మాంవుర్కేమ్నవుంటే నీపాదాల్కి బ్రిహ్మాల్ గమ్మల్ సెలగాల్ గిలగాల్ మొక్కుతాక.

నీలా—(తనలో) తక్కువాలిన డబ్బుకోసం యెట్టినీచకులజునితోనైనను తిరుగుచుంటినిగదా. (ప్రకాశముగా) లెక్కయిప్పిస్తారా, ముసలిది అడుగుతూవుంది.

శ్యామ—అరే మాకీ నీకీ సొమ్ము యియ్యకుండా పారిపోతాం అనుకున్నావే మేమిటీ? పర్వానహీం. ఆముసల్డీ కోనో భాంచోత్. పెద్దమనుష్యాల్ని యిల్లా అడుగుతుంది. ఖతల్ చేస్తాన్. నహాఁ—

సాహెబ్ అనగా యేమనుకొన్నావ్ ?

సీలా—మాలో సాధారణంగా యెవ్వరూ సాహెబులతో స్నేహం చెయ్యరండీ. యేమో మీరు గొప్పవారని నేను ఒప్పుకొన్నాను. మాకులంవాళ్లు విన్నారంటే యిదిశాలా తప్పుకింద భావించుతారు.

శ్యామ—మాకీ కోస్తే నత్తుక్. మీకీకోస్తే ఫాలువస్తాంగ్. అకే ఏమి మాట చెప్పుతాన్. మాకీ అనేకపట్నాల్ వెళ్ళినాము. పెద్ద పెద్ద కంచెన్కుచూశామ్.

సీలా—గొప్పవారు మీరే.

శ్యామ—ప్యారీ! జరాసీ ఇల్లారా. మాతో కొంచం సరసంచెయ్యి. నీమీద మాకు నిండా కుషీగావుంది. నీకీ సలాంచేస్తాం

(చెయ్యిబట్టుకొని కూర్చోపెట్టును.)

సీలా—(తనలో) దిక్కుమాలిన చేతులు తాటిబద్దలులా వున్నాయి.

శ్యామ—హె సీలాచలం! జల్దీ బ్రాంది పీవో, అమ్ లకాయే. తీన్ చార్ డ్రామ్ లగాయేతో ఖోత్ కుషీ హోజాతా.

సీలా—మాకాట్టే అలవాటులేదండీ !

శ్యామ—పర్వానై (త్రాగించి) ఖాక్ సుపారి కావ్హై.

సీలా—తురకలు తమ కులలక్షణాలు పోనియ్యరుగదా. ఇది పుచ్చుకొన్నప్పటినుంచి నన్ను తిరుగుతూవుంది.

శ్యామ—మాకుం జల్దీసోజానా. పూరానిపా మెక్కింది ఆవ్.

(నిష్క్రమింతురు.)

[తరువాత శ్యామసుందరరావు ప్రవేశించును.]

శ్యామ—ఇప్పుడు రెండుఘంటలయింది. ఇంకఆట్టే ఆలస్యంచేస్తే కొంప మునుగుతుంది. ఈముండను పూర్తిగా నైశపెక్కడంచేత నిద్రపోయింది, వొళ్లోవున్నవి అన్నీబంగారం కనపడ్తొంతమట్టుకు

వలుచుకొన్నాను. ఈసాహెబు బట్టలుకూడా యిక్కడే వదిలి వేసి నెమ్మదిగా తలుపుతీసుకొని యిప్పుడు నాలుగుగంటల రైలుమీద ప్రయాణించుతాను. (నిష్క్రమించును.)

[నీలాచలం ఏడుస్తూ ప్రవేశించుచున్నది.]

నీలా—అయ్యో! అమ్మా! అమ్మా! ఇల్లోరా. దిక్కుమాలిన సాహెబు యెక్కడనుంచి వచ్చినాడే? నీడుదొంగే అయ్యో! నావస్త్రములు అన్నీ దోచుకొని తలకిత్తించి మాయపోయినాడే. ఇప్పుడు పోలీసువారితో యేమనిచెప్పను? సాయిబు నాయింటికివచ్చినాడని చెప్పితే మనవాళ్ళు నలుగురూ నవ్వుతారు. ఎంతో మందిని వంచించి యార్జించిన డబ్బంతా ఒక్కపూటలో పొట్టను పెట్టుకొన్నాడే. నాదేహం కుంగిపోయింది. దిక్కుమాలిన వ్యభిచారవృత్తివలన మావాళ్ళు లాభం వుందంటారు. కాని కూడపెట్టినడబ్బు యిల్లాగేపోతుంది. ఛీ! దిక్కుమాలిన వ్యభిచారమా నీవిక మాకులంలోకి రాకు. ఓ నాఅక్కలారా! వ్యభిచారం పూని మనము పురుషులను వంచించి దాచిన పాపపు సొమ్ము మనకూడదక్కదు. తాత్కాలిక సౌఖ్యమిచ్చినా అది స్థిరమైంది కాదు. లోకానికి మనము చీడపురుగువంటివారమని లోకు లనుకొనుచు మనలను అతిహేయముగ జూచుచున్నారు. కాబట్టి మనమందరము వ్యభిచారవృత్తిమాని మనపిల్లలకు వివాహములుసేయుట మంచిది. మానాభిమానములు వదలి మేళములలోకి వెళ్ళి గంతులువేయకండి. ఇది మనకు శ్రేయస్కరము. వినండి నామాట వినండి. (నిష్క్రమించును.)



రంగము:—[రామయ్య ప్రవేశము]

రామ—(తనలో) ఈవేశ్యలలో యేమి "యల్లక్ట్రిసిటీపవర్" వుందో

ఎల్లి—అయ్యా! నేను నెశ్చితం కార్యం కాకపోవడం కూడానా? అయిందిగాని కొంతకిటుకు పెట్టిండి.

రామ—ఆ దేమిటి! ఆ కిటుకు ఏకిటుకుపెట్టినా కార్యసాధనం అవుతుం టున్నదా?

ఎల్లి—మరేమీలేదు ఏముంది బాబూ! భోగంలంజలకు డబ్బువిష యంలోనేగా ఏకిటుకు పెట్టినా. అంతేగా.

రాము—ఏమందేమిటి? అది యేదో త్వరగా చెప్పరా. ఏలాగో ఒకలా గున ఘాటుసలు చేదాము.

ఎల్లి—ఏంలేదు బాబూ! ఆప్రాంతికి తనుదు దయచేసి కన్నెతనముహారి త్సవంజరిగించేటట్టయితే నాలుగువందల రూపాయిలుయిమ్మంది. లేకపోతే ఆదేయిక్కడకు వచ్చేటట్టయితే అయిదువందల రూపాయలు యిస్తేనేగాని వల్లకాదంది. ఇది వున్నమాట తమయాజ్ఞ లేందే ఎట్లా ఘాయిసలుచేయడానికి మనస్సుపోక తిరిగి వచ్చేశాను.

రామ—ఏద్! వెధవయ్యా! ఏడిసలేకపోయినావు! ఈమాత్రానికి మళ్ళీ తిరిగి రావాలా! ఇల్లాంటి వ్యాపారంలోనయిన్నీ హెచ్చుతగ్గులు వస్తే నేనుమాత్రము యేమయినా అంటానా.

ఎల్లి—డబ్బుతో వ్యాపారంగనుక కాస్త ఆలోచించవద్దా! బాబూ డబ్బుయిచ్చే కామందులు మీరు, సౌఖ్యాన్ని నేను, మీసెల వులేకుండా స్వతంత్రించడానికి వల్లవున్నదా?

రామ—ఇప్పుడయితేనేమి? నువ్వు తిరిగీ యీ 10 గంటల ప్యాసెంజరు లోనే యేలూరువెళ్ళి ఆయిదునూరువందలరూపాయలకు వప్పుకొని యిక్కడకువచ్చే యేర్పాటు చెయ్యి. పైగా దానికి రాకపోక లకు రైలుఖర్చులకు వగైరాలు ఇంకో 50 రూపాయలకంటె యెక్కువ అవవు పోనీ దానమ్మాసిగ్గోసినడబ్బులే. మన్నిడబ్బ

రంగము:—[చకోరాక్షియిల్లు—ప్రవేశము
రామయ్య—చకోరాక్షి.

చకో—షావుకారుగారు యీవాళ మాయందు దయదలచినారు. అందుకనే మబ్బుపట్టింది.

రామ—ఏం వంతమాటా హాగాముక్కలేస్తావు. నేను యెప్పుడూ మీయింటికి రావడమే లేదా?

చకో—ఇప్పుడు యెందుకువస్తారులెండి. మీరంతా పెద్దపద్దులు. మాబోటి పేదవాళ్ళమీద దయవుంటుందా యేమిటి? మీరు పిఠాపురముదాసీలనుమరిగినారు. "దూరపుకొండలు నునుపుగదా."

రామ—(తనలో) ఈకాలమున గోడలకు చెవులున్నాయి. నేను పిఠాపురందాసీకి 500 రూపాయలుయిచ్చి కన్నెరికంపెట్టినానని దీనికి యెలా తెలిసిందో కాదా. (ప్రకాశముగా) నీమాటలకేమిలే నీవుమాటలయందు మహాజాణవు. నీమాటలకు యెవ్వరూ జవాబు చెప్పలేరు.

చకో—దీనికేంలెండి. మీకేదో పెద్దపనివుంటేనేగాని యిలా దారితప్పిరారు. అదియేమిటో కాస్త చెప్పండి.

రామ—నేను నిజంగా నీవన్నట్లు పనివుండేవచ్చినాను. ఆపని నీవుతప్పకుండా నాయందు దయవుంచి చేస్తానంటే చెప్పుతాను. నీవు తప్పకచేస్తావనే ధైర్యముచేతనే యిల్లావచ్చినాను.

చకో—మీకు మాయందు దయలేకపోయినా నేనుమీపని అంటే చేయడానికి వెనక్కుతీస్తానా యేమిటి? అదేమిటో చెప్పండి.

రామ—ఏమీలేదు. రేపురాత్రికి ఇక్కడికి యేలూరునుంచి మీవాళ్ళే ఒకమనిషి వస్తుంది. నేనురమ్మనమని కబురుపంపించినాను. అది యీవూళ్ళో నాలుగైదురోజులు వుంటుంది. ఈనాల్గురోజులూ మీయింటిలో ఏదైనాగది యివ్వాలి.

చకో——ఎవరండీ ఆమనిషి. ఏంపనిమీదవస్తావుందేమిటి ?

రామ——(తనలో) ఈముండ కోడుగుడ్డుకి వెంటుకలు లెక్కపెట్టుతుంది (ప్రకాశముగా) ఏమిటో నానోటితో చెప్పిద్దామని అడుగుతావుకాని ఈలాటిరహస్యాలు నీకు తెలియకుండా యేమిటి ?

చకో——మళ్ళీ యేవూరునుంచి యెవ్వరైనా కన్నెరికంకోసం పిలిపిస్తున్నారా యేమిటి? ఇల్లాగేవుంటె లెండి వ్యాపారంచూస్తే.

రామ——ఆమాట నాచేత యెందుకు చెప్పిస్తావు ?

చకో——మీకేమండి మహారాజులు ! పెద్దలుసంపాయించిన ఆస్తివుంది గదా! అన్నదమ్ములతో దెబ్బలాడి పంచుకొన్నారుగదా.

రామ——ఈమాటలకేమిగాని నాసంగతియేమిచేస్తావు?

చకో——మాఅమ్మను కనుక్కొంటేనేగాని ఈసంగతియెల్లానేను స్వతంత్రించి చెప్పగలను? ఇల్లాటిది నేనుచేశానంటే ముసలిది యేమంటుందో.

రామ——మీరు నాకు వుచితంగా యేమిపనీచెయ్యవద్దులే. మీకూనేను యేదో ముట్టచెప్పదలచుకునే వున్నాను. అదిగాకుండా నేను మీకు యింతమాత్రము వుపకారం చెయ్యలేకపోలేను. డబ్బు యిస్తే మీవాళ్ళల్లో యెవరైనా గడియిస్తారుగాని యేమో నీవు యెరిగివున్నదానవు గనుక ఆముట్టచెప్పేది నీకే ముట్టచెప్పితే సంతోషిస్తావనే యుద్దేశంచేత వచ్చినాను.

చకో——అయినా మాఅమ్మని మీయెదటికేపిలిచి కనుక్కొంటాను. (ప్రక్కకుజూచి) అమ్మా అమ్మా.

[వేశ్యమాత ప్రవేశించును]

వేశ్యమాత——ఎందుకే అమ్మాయీ! పిలిచినావు (రామయ్యనుచూచి) వీరెవరు! ఓహో రామయ్యగారా యేమిటి? ఈవేళ ఇలా దారితప్పి వచ్చినారు.

చకో—అమ్మా! నీరికి మనయింట్లో నాలుగయిదు రోజులుదాకా ఒక గదికావాలట ఎవరో మనవాళ్ళే ఏలూరునుంచివచ్చి నాల్గురోజులుండి పోతారట.

వేశ్యమా—గదులు కావలసినప్పుడు మనం కనపడుతామా యేమిటి? మనయింట్లోగది యేలాగు? రేపటిరోజున మీచెల్లెలు వరలక్ష్మివ్రతము చేసుకోవాలనంటూవుంది. మనయింటికి చాలామంది మనవాళ్ళొస్తావస్తారు అదికాకుండా ప్రతిగదినిండా సామానువుంది. ఎల్లాగో పాపము పెద్దమనుష్యులువచ్చి అడిగినప్పుడు వీలులేదని చెప్పడానికి చాలా చింతగావుంది.

రామ—నీవు యివ్వాలని వుద్దేశంవుంటే యెల్లాగో అల్లాగ యియ్యగలవు. నేనుమిమ్మల్ని సంతోషపెడుతానులే. మీఋణము వుంచుకోను. నీ వేమీ సందేహించనక్కరలేదు.

వేశ్యమా—(రామయ్య వ్రేలియుంగరముచూచి) ఈవుంగరం క్రొత్తగా చేయించినారా యేమిటి? ఎన్నాళ్ళమట్టో యిల్లావుంగరము చేయించవలసినదని మా రెండోపిల్ల చంపుకుతింటూవుంది. వెనుక ఒకరివేలుకుచూచింది. అప్పటినుంచి ఒకటేపట్టుపట్టింది. నమూనా కంసాలికి చూపిద్దామంటే దొరకకుండావుంది. ఒక్కసారి తమరైనా యిప్పిద్దురూ. కంసాలికి చూపించి మళ్ళీ యిచ్చివేస్తాను.

రామ—అల్లాగే యిస్తాను. నీవంటే అల్లా చెప్పినావు గాని నేనభయపడుతానా యేమిటి? ఇదిగో తీసుకో. నీపనైనతరువాత మళ్ళీ యియ్యి. (ఇచ్చును.)

వేశ్యమా—ఇయ్యక యెగగొట్టుతా ననుకొన్నారా యేమిటి?

రామ—నీదగ్గిర యేమాటచెప్పినా తంటాగానే యుంది. సరేగానిగది సంగతి యేమిచేస్తావు?

వేశ్యమా—ఏం లేదు. గడియయ్యాలంటే మాఅమ్మాయి వీరలక్ష్మీ వ్రతము మానమనాలి. మానమంటే అదియేడుస్తుంది. లేకపోతే క్రొత్తనగ చేయిస్తున్నాను అదివచ్చిన తరువాత పెట్టుకొని వ్రతం చేస్కుందుగాని అని చెప్పాలి.

రామ—ఏదో మొత్తరుగా నీవు సర్దుబాటు చేయకతప్పదు. కాకపోతే ఈ ఐదు సవర్నులు తీసుకొని నాను చేయించి పెట్టానని చెప్పు.

(5 సవర్నులు యిచ్చును.)

వేశ్యమా—ఏమిటండి మీరాకు శ్రీమయియ్యాడు ?

రామ—నాఅవసరం. అదికాకుండా మీయింట్లో అయితే నేను యిల్లా చేసినానని రెండోకంటివారికి తెలియకుండా వుంటుంది.

వేశ్యమా—పెద్దమనుష్యులమాట తీసెయ్యలేను. సరే మీచిత్త ప్రకారమే చేస్తాములెండి.

రామ—సరే. ఇక నేను వెళ్ళుతాను. మళ్ళీమళ్ళీ చెప్పనక్కరలేదుకదా?

వేశ్యమా—అక్కరలేదండీ.

(అందరు నిష్క్రమింతురు.)



[రంగము:—చకోరాక్షియిల్లు, ప్రదేశము, గరుడాచలము, ఎల్లిగాడు.]

గరు—చూడు ఎల్లిగా! అంతదూరాన్నుంచి యింతదూరం వచ్చినాను. నాకు ఇక్కడ యేమిచిక్కులు వస్తాయో అనిభయంగాను అనుమానంగాను వుంది. అందుకుగాను నేను చెప్పమన్నమాట మీసాహుకారుగారితో చెప్పినావా లేదా?

ఎల్లి—డబ్బు అంటే అయిదువందల రూపాయలు. ఇప్పుడే తెమ్మన్నమాటేనా చెప్పినాను. ఆయనవిషయంలో నీవు అల్లా సందేహించనక్కరలేదమ్మా. అల్లా దగాచేసేవారుకారు. ఆయన

మనస్సుకుదిరిందా ఐనువందలకియింకా ఐనువందలుచేర్చియిస్తారు. డబ్బులంటే ఆయనకు లక్ష్యంలేదు. ఇల్లాటివి ఆయనకు యెన్ని అయినా వచ్చుకొన్నావు. ఇదేకొత్తగాదు. ఇలాటి వెన్ని ఖర్చులయినవో.

గరు—వారు పెద్దమనుష్యులేఅయివుంటారు. అందులో సందేహమేమీ లేదుగాని అయినా ఆహారంపట్ల వ్యవహారంపట్లా మొఖమాటం వుండకూడదని చెప్పినారు. అందుచేత అడిగినానుకాని మరోటి కాదు. నీవుయింకో మోస్తరుగా ఆలోచించవద్దు.

ఎల్లి—అవును లెండి. అందుకనేఆయనతో చెప్పినాను. ఆయనయిప్పుడే డబ్బు పట్టుకొనివస్తారు. ఆయనకు డబ్బు కేం కొదవ?

గరు—నేనూ డబ్బుకోసం అట్టేఆలోచించలేదు. వారు చాలాగొప్ప వారని మర్యాదస్థులనిన్ని యింతదూరము వచ్చినానుకాని లేక పోతే ఈమాత్రముసొమ్ము నెలూరులో యిచ్చేవారు లేక పోలేదు.

ఎల్లి—అదుగో! ఆయన వేవస్తున్నారు. ఇక మీరుయిష్టను.

గరు—(లేచి) దండాలండి.

రామ—(తనలో) భగవంతుడు నాయందుండబట్టే యిట్టి దివ్యమం గళవిగ్రహం అంతదూరాన్నుంచి యింతదూరంవచ్చే భాగ్యం లభించింది. వెధవడబ్బు పోతే నేంగాక. ఆహా! దీని మొగం చూస్తే చంద్రవదన యను పదము నిఘంటువులో వేసి కవీశ్వరులు గ్రంథాలలో వాడడం మొదలుపెట్టినారని తోస్తుంది. దీనిపళ్లుబ్రహ్మ దేవుడు వజ్రాలతో చేసినాడుకాబోలును. నవ్వితే మొహారీలు రాల్తాయి. (సమీపించుచున్నాడు.)

గరు—ఇల్లా దయచేయండి.

రామ—నీవుమావూరుకు వచ్చినప్పుడు మేమునిన్ను మర్యాద చెయ్యాలి. నిన్నుమర్యాదచెయ్యడానికి తగినట్టియిల్లు కొరకనే లేను. ఎల్లాగయితేనేం కష్టమువిూద యీవాచకోరాక్షి పాపము నాయందున్న విలువచేత యీయిల్లు యిచ్చింది.

గరు—మీరునాయందున్న ప్రేమచేతల్లాచేస్తారుగాని, నేనంతమర్యాదకుదగినదాన్నా. మీలాంటివారిదయ సంపాదించుకొని జీవించవలసినదాన్ని.

రామ—నీవల్లాగ చెప్తావుగాని, నీయొక్కఅందమే నాబోటివాళ్లను అనేకమంది నీకు దాసానుదాసులుగా చేస్తుంది. నీదగ్గరవున్న సౌందర్యముచేత నేకాదూ నిన్ను నేను యీవూరునుంచి రప్పించాను.

గరు—నాయందుమీకు దయవుండడంచేత.

రామ—నీకు కావలసినదంతా యీయెల్లిగాడుసప్లయిచేసినాడా? ఎల్లిగాడు బజారు వెళ్ళినాడా లేదా?

ఎల్లి—వెళ్ళలేదు. బాబూ వెళ్దామనుకుంటూవుండగానే యింతట్లోకి మీరువచ్చినారు.

రామ—అల్లాగయితే నీవుబజారుకు తొందరగా వెళ్ళిరా. పాపము వీళ్ళకు భోజనానికి ప్రొద్దెక్కగలదు.

గరు—పరవాలేదులెండి. ప్రొద్దున్నే మాతమ్ముడు కాఫీహోటలుకు వెళ్ళిఉపమాయిడ్డెన్లూ కాఫీ తెచ్చినాడు. అవిపుచ్చుకొన్నాము.

రామ—ఓరే. యెల్లిగా. బజారునుంచి ఏంకూరలు పట్టుకొనివస్తావు?

ఎల్లి—ఏంపట్టుకురమ్మనిసెలవిస్తే అవిపట్టుకొని వస్తాను.

రామ—గరుడాచలాన్ని కనుక్కో. వాళ్ళకు యేమియిష్టమో.

గరు—ఏవయినా సరేనండీ. మీయిష్టంవచ్చినవి తెప్పించండి.

రామ—ఒరేచూడు. ఒకవీశెడు బంగాళాదుంపలు. మువ్వావలా అవుతాయి తరువాత పెద్దచిక్కుడుకాయలు ఒకవీశెడు. అర్ధరూపాయి యిస్తున్నారు. దోసకాయలువదలం. బియ్యంవున్నాయే సన్నబియ్యం అనిచెప్పు లేకపోతే ఢిల్లీభోగాలంటే తెలుస్తుంది రూపాయికి 3 శేర్లన్నర యిస్తారు. అవి రెండురూపాయలవి పట్టుకొనిరా.

ఎల్లి—బాబూ. మనయింటికాడకూడా కూరలు బియ్యం అయిపోయినాయని చెప్పినారు.

రామ—యింట్లోకూడా అయిపోయినాయా, సరే అలాగయితే మన మామూలుకొట్టుదగ్గరకు వెళ్ళితే అక్కుళ్ళుబియ్యం రెండురూపాయలవి తీసుకొనిరా. జాగ్రత్తగా కొలిపించుకో 16 శేర్లు యిస్తాడు. ఇంకకూరలు చౌకగాచూచి బజ్జివంకాయలు, ఒక పొట్లకాయ కానీయిస్తేవస్తుంది. ఒకడబ్బుతోటకూరకూడా తీసుకో. ఒకడబ్బు పచ్చిమిర్పకాయలు కొత్తిమిరాకు కలిసివుచ్చుకో. తెలిసిందా వెధవా మరచిపోయేవు. జాగ్రత్తగా పట్టుకొనిరా. పో.

ఎల్లి—చిత్తం. (నిష్క్రమించును)

[మాధవుడు ప్రవేశము.]

మాధ—ఏమే. అక్కయ్యా. ఇంకా యిల్లాగేకూర్చున్నావు. వంటప్రయత్నం ఏమీలేదా యేమిటి?

గవు—అప్పుడే నీకాకలివేస్తూవుందా. ఇప్పుడేకాదంట్రాకాఫీతాగింది.

రామ—నీతమ్ముడాయేమిటి?

గవు—అవునండి. నాతోబుట్టువువచ్చినాడు. (మాధవునిజూచి) పెద్దమనుష్యులతో మాట్లాడేటప్పుడు అల్లరిచెయ్యకు. వీరెవరు అనుకొన్నావు. ఈయనే మనలను యిక్కడకు పిలిపించింది.

మాధ—అల్లానా బావగారూ పండాలుం. మా బావగారన్న సంగతి నాకు తెలియలేదండీ. (ముంచుక యూరుకుండి) ఏమండీ బావగారూ. మీపూరువస్తే యేమీ తోచడమే లేదు.

రామ—మీపూరుకంటె మాపూరు బాగావుంటుందే. కాఫీతాగిన వాడవు నాల్గుబజారులు షికారులుకొట్టి రాకపోయావూ?

మాధ—బజార్లు షికార్లుకొట్టడం అంటే సామాన్యంగావుందా. ఏమన్నా నాలుగుడబ్బులు వుండాలా లేదా? మా కెక్కడనుంచి వస్తాయి. పోనీ కొండంత షావుకార్లు యిక్కడకు మమ్మల్ని పిలిపించారు. ఈ వెధవకు యేమయినా ఖర్చుకిచ్చారుగనుకనా?

గరు—షావుకారుగారు నీకెప్పుడే యియ్యని వేళ అయిందిరా.

మాధ—ఎప్పుడో యిస్తారంటావు. అడిగితే యిప్పుడు లేదుగాని అడగంటే ఎప్పుడో యిస్తారంటావు "పగలు చేతితో పిలిస్తే లేదుగాని రాత్రికి కన్నుసైగ చేశాడట" నువ్వు చెప్పినమాట జ్ఞాపకంవుంది.

గరు—ఏడిశావు. నీవుమాటలు మానేర్చావు.

మాధ—మా బావగారి జేబులో యేముందో. (జేబులో చేయిపెట్టబోవును)

గరు—ఓసే. ఏమిటీ సాహసము. జేబుల్లో చేయిపెడ్తావు. యేమనుకొన్నావేమిటి? వారి జేబులు యెప్పుడూ నోట్లతోను సవర్నులతో నునిండివుంటాయి. యేమన్నా పోయిందంటే నిన్నూ నన్నూ కూడా స్టేషన్కులాక్కెళ్ళుతారు.

రామ—మరేం పర్వాలేదు. ఇంటిమారాణికే. జేబుల్లోవుండేమాత్రము. ఈ జేబులోవుండేదంతా మీకోసమే.

గరు—జేబులోవుండేదంతా మాకోసమే. అయితే మాయింటికి బంగారపుగోడలే పెట్టుతాము

నీవుమధ్యాహ్నం భోంచేసి మాకొట్టుదగ్గిరకురా. మిల్లులోకితీసు కొనివెళ్ళి నీకుకావలసిన ఖండ్వా యిప్పించెదను.

మాధ—చిత్తము.

రామ—గరుడాచలం, ఇంకనాకూకాస్త కొట్టుదగ్గిర పనివుంది. నీకూ వంటకు పొద్దెకుతూవుంది. కాబట్టి నేను వెళ్ళి సాయంకాలం పెందరికాడ భోంచేసుకొని యిక్కడకు వస్తాను.

గరు—చెప్పడం మఱచిపోయినాను. మీయెల్లిగాడు నాతో మూడు కొత్తచీరెలు పంపిస్తానని చెప్పినాడే. అవియేవి?

రామ—మూడుచీరెలు కావాలి?

గరు—తమబోటివాళ్ళు యియ్యకపోతే మరెవరు యిస్తారు? నేను యేలూరుకు వెళ్ళితే మావాళ్ళందరూ అంతదూరంవెళ్ళి యేం తెచ్చావు. షావుకారుగారు యేంబహుమతిచేశారంటే యేంచెప్పమన్నారు. తెల్లమొగంవేసుకొని చూస్తే నలుగురూ నవ్వరా యేమిటి? పోనియ్యండి మీగొప్పవుంచుకోడానికన్నా నన్ను సన్మానించవద్దూ.

రామ—పోనీ. ఇంకేదా. ఇందులో నాకు యేం యిబ్బంది? అల్లాగే యెల్లిగాడిచేతికిచ్చి మంచివి జరీచీరలు మూడుపంపుతాను. ఇంక నాకు పొద్దుపోతూవుంది వెళ్ళుతాను.

గరు—వూరుకొన్నా వాడూరుకోడు మాంతమ్ముడికి పట్టుపంచెలివ్వాలని పెట్టాన్నారు. ఇంక అస్తమానం వాడునన్ను అదే అడుగుతూ వుంటాడు. మీతో వాడిని యిప్పుడు పంపమన్నారా లేకపోతే భోంచేసి పంపమన్నారా.

రామ—ఇప్పుడు నేనుకొట్టుదగ్గిరకు వెళ్ళుతాను. మధ్యాహ్నం యెల్లిగాడితో మాకొట్టుదగ్గిరకుపంపు. వాడికికావలసినదికొని పెడ్తాను.

(అందరు నిష్క్రమింతురు.)

రంగము:— రామయ్య, యిల్లుప్రవేశము;—
రామయ్య భార్యయగు, కామమ్మ ప్రవేశము.

కామ—(తనలో) నేను కాపరానికి వచ్చింది మొదలు యీయన ఒకనాడైనా యింటివద్ద బసకున్న పాపాన్ని పోలేదుకదా. అస్తమానం యేక భోగంవాళ్ళు. వాళ్లంటే పడిచస్తారు. ఈ భోగంవాళ్లకోసం ఎక్కడెక్కడ చూచినా ఏలూరు, పిఠాపురం, మొదలయినవూళ్ళకి వెళ్ళివస్తూవుంటారు. ఇంతకూడా సాగించినారు. ఇంక యీ కాపురం బాగుపడేది యెల్లాగు? ఈ వాళ మట్టుకు యీ వాళ యెవత్తో భోగందాన్ని ఏలూరునుంచి పిలిపించినారట. నాల్గురోజులు ఈవూళ్లో వుండడానికిన్నీ, ఈయన దానికి 500 రూపాయలు యియ్యడానికిన్నీ వప్పుకొన్నారట. అయ్యో, డబ్బంతా యిల్లాగే [illegible] పోసేస్తున్నారు. పోసినా కేమని వూరుకొందామంటే చూస్తూచూస్తూ వూరుకోవడం యెల్లాగు. కానీ, ఈ రాత్రి ఈయన యేలూరు భోగందాని యింటికి వెళ్ళుతారట. ఎల్లాగయినా దానికి విఘాతం కలిగించాలి. అయ్యో! ఈయన కార్యానికి నేను విఘాతం కలిగిస్తే రాత్రికి నాయుడు నాయింటికి రావ[illegible]. పోని. ఈ వేళ ఒక్కరోజు రాకపోతే నేం. నేను సమార్తాలు వచ్చేదానికి ముల్లె సటిస్తాను. దానితో ఆయన [illegible] యెక్కడకు కదలకుండా వూరుకొంటారు. ఏమయినా సరే. యిల్లా చేస్తాను.

[ఎల్లిగాడు ప్రవేశము.]

ఎల్లి—అమ్మగారండమ్మా. కూరలు తెచ్చాను.

కామ—అబ్బా! [illegible] కూరలురా. నాకు వంట్లో చాలాసుస్తీగావుంది. [illegible] మామయ్యగారిని త్వరగా యింటికి [illegible] వేసుకోమని చెప్పు. నేను వంటవండలేను. నీవు

తెచ్చిన వస్త్రాలన్నీ అక్కడపడెయ్యి. సర్దడానికన్నా శక్తిలేదు. నీవు త్వరగా వెళ్ళి షావుకారుగారిని పిలుచుకొనిరా!

ఎల్లి—చిత్తంఅమ్మా. (నిష్క్రమించును.)

కామ—(తనలో) కాని. ఏమయి తేలయింది. రానీ ఆయన్ని ముప్పు తిప్పలుపెట్టి మూడు చెర్వులనీరు తాగిస్తాను.

(పడుకొనును.)



[రామయ్య—ప్రవేశించును.]

రామ—(భార్యనుచూచి) ఏమే! యింకామడికట్టుకోలేదు. వంట ప్రారంభించడానికి యింకా వేళ కాలేదనుకొన్నావా యేమిటి?

కామ—అయ్యో! నన్ను మాట్లాడించకండి. నావళ్ళంతా తిరుగుతూ వున్నట్లున్నది. గుండెలలోదడగావుంది. నేనువంటచేయలేను. పోనియ్యండి ఈపూటకుయెవళ్ళనయినా పిల్చుకొనివచ్చి వంటచేయిస్తూరా. ఏదో ఈపూటకు ఒకపావలా యివ్వవచ్చును.

రామ—ఇంతపొద్దెక్కిన తరువాత యెవరువస్తారు? పోనిలే. నేనే కాసినినీళ్ళు పోసికొని ఏదో అత్తెసరు పడవేస్తాను.

కామ—ఏదోఒకటి కానియ్యండి త్వరగాను. వళ్ళుతిరుగుతూవుంది. అమ్మా, అయ్యో. ఊఊ. (మూలుగుచున్నది.)

రామ—(త్వరలో) తీరాదీనికి మంచిసమయాని కేసుస్తీ చేసింది. ఈరాత్రికూడా గరుడాచలం దగ్గరకువస్తానని అయిదువందల రూపాయిలుకూడా యిచ్చినాను. దీనిసుస్తీ నాకార్యానికేమి యంతరాయంగలిగిస్తుందో.

కామ—అయ్యో! అమోమయంగావుందండీ. (మూర్ఛపోవుచున్నది)

రామ—యిదెక్కడిఅవస్థ యిప్పుడేంచెయ్యను! ఒసే ఎల్లిగా నీవుఒకసారివెళ్ళి డాక్టరుగారిని నేనుచెప్పినాను అని చెప్పితీసుకురా

నేను నెమ్మదిగా దీనిని యిక్కడనుంచి గదిలోనికి తీసుకొని వెళ్ళి పడుకో పెడ్తాను.

(నిష్క్రమించును.)

[రంగము—గరుడాచలం—ఎల్లిగాడు]

గరు—ఏమి మళ్లీయిప్పుడింత తొందరగావచ్చావు యేమిటి?

ఎల్లి—ఏంలేదు. ఒకగొప్పవిఘాతంవచ్చింది. రామయ్యగారి భార్యకు చాలా జబ్బుచేసింది. రెండుమూడురోజులదాకా తీరుబడినుండదు. అందుచేత మిమ్మల్ని నాల్గురోజులదాకా వుండమన్నారు. ఈలోపుగా మీకుఅయ్యేఖర్చంతా పెట్టామన్నారు.

గరు—బాగానేవుంది. పొరుగూరువచ్చి యినాళ్ళు ఒకరింట్లోవుంటే యేం బాగావుంటుంది? తీరాఆయనదగ్గరనుంచిడబ్బుకూడా ముందే పుచ్చుకొన్నాను. యిప్పుడిచ్చేస్తే ఏంబాగావుంటుంది? పోనీ యిచ్చేసి మావూరికి వెళ్తాను ఆయన యెప్పుడురమ్మంటే అప్పుడు వస్తానని చెప్పితే ఏమనుకొంటారో.

ఎల్లి—మీకేం భయంలేదు. నేను చకోరాక్షితో మాట్లాడినాను. మీరెన్నాళ్ళైనా వుండవచ్చును. ఆలస్యమైనందుకు మీరా [illegible] బాధను ఆయనవల్ల పొందకపోరు. హఠాత్తుగా ఆ [illegible] భార్యకిక జబ్బుచేస్తుందని యెవరైనా అనుకొన్నారా! [illegible] మీకయ్యేఖర్చులన్నీ ఆయన భరా[illegible] మీకు సందేహమెందుకు?

గరు—స[illegible]స్తే యేమవుతుంది. మావాళ్ళకు యీవా[illegible] వ్రాస్తాను. లేకపోతే వాళ్ళు బెంగపెట్టుకుంటారు. పోస్టా[illegible] తెచ్చిపెట్టు.

ఎల్లి—[illegible] (నిష్క్రమించును.)

[చకోరాక్షితల్లియగు వేశ్యమాత ప్రవేశించును.]

వేశ్యమాత—ఏంఅమ్మాయి. ఏదో ఆలోచిస్తూన్నావు. పాపము అనుకొన్నదాన్కి భంగమయిందికదా. ఈవాళ వద్దామని షావుకారు గారు మహాసంతోషంపడ్డారు. అయితేనేంగాక పాపమాయన పెళ్ళానికి హఠాత్తుగా మూర్ఛలరోగం పుట్టింది.

గరు—అవునట పెద్దమ్మా! ఆయన నౌకరు యిల్లిగాడు యిప్పుడే చెప్పినాడు.

వేశ్యమాత—పోనీలే. యిప్పుడు మించిపోయిందేమున్నది? మీస్వాంతయింట్లో యేలావున్నవో యిక్కడా అల్లాగేవుండు. నీకేమీ అభ్యంతరములేదు. ఈవాళనుంచి వంటకూడానువ్వు చేసికోకు. మాతోపాటు నువ్వూ మీతమ్ముడూ భోంచేతురుగాని. ఏమిటో మళ్ళీ నువ్వు చెయ్యి కాల్చుకోనేది యేమిటి?

గరు—పాపము మీకు శ్రమయియ్యడం యెందుకు?

వేశ్యమా—మాకు శ్రమయేమిటి? నువ్వేమి పరాయిదానవా యేమిటి. మాకు బాధుకోటింగోదానవే. నీవాసం దేహం యేమీ పెట్టుకోవద్దు.

గరు—నువ్వుఅల్లాచెప్తూవుంటే నీమాటవల్లకాదనడం నాకు యేమి బాగుంటుంది. నీయిష్టప్రకారమే చేస్తాను.

వేశ్యమా—ఈసంగతి అల్లావుంచు, నీకింకోసంగతి చెప్తాను. అదినువ్వు రహస్యంగా దాచాలి. ఎందుచేతనంటే నీవుచిన్నదానవు. యింకానీకు మనవృత్తియొక్క అనుభవంగాలేదు, నీవు మీవూరినుంచి పొరుగూరువచ్చినావా వెళ్ళేటప్పుడు నాలుగుడబ్బులు సంపాయించుకొని పోవాలిగాని వూరికే వెళ్ళితే అట్టేగొప్పకాదు.

గరు—డబ్బుకోసమేకాదూ పెద్దమ్మా. ఈషావుకారు కబురంపితే వచ్చింది.

వేశ్యమా — ఈసంగతిసరేలే. షావుకారు యివతలకు రావడానికి రెండుమూడురోజులు పట్టుతుంది. ఆయనభార్యకు నెమ్మదిగావుండాలా. అంతవరకు నీవు ఆయన పంపించేది పూరికే తింటూకూర్చుంటే యేమిలాభమువుంది ?

గరు — ఏంచెయ్యమన్నావు ?

వేశ్యమా — ఏంచెయ్యమన్నావని నన్ను అడుగుతున్నావు. యింతమాత్రంనీవు గ్రహించుకోలేవు. నేనుచెప్పాలి. పొద్దున్న మాయింటికివచ్చినఆయన్ని చూచావా. ఆయన ఒక నాయుడులే. చాలా గొప్పవాడు. మాయిల్లుఆయనకు తాకట్టువుంచి ఒక వేయిరూపాయీలు అప్పు తెచ్చుకొన్నాము.

గరు — ఆయన మొగం చూస్తేనే భాగ్యవంతుడని తోస్తూవుంది.

వేశ్యమా — ఆయనకంట నీవుపడ్డావు. దానితో ఆయనచిత్తం చలించిపోయింది. ఈవిషయంలో ఆయననాతో మాట్లాడితే, ఈపిల్లకు యింకాకన్నెరికం కాలేదు. ఈవూళ్ళో ఒకషావుకారుగారు పిలిపించినారు అనిచెప్పినాను. చెప్పితేనేమి ఆయన నాకదంతాపనికి రాదు ఎంతడబ్బు కావలస్తే అంతడబ్బు యిస్తాను అని నన్ను కనుక్కోమని బలవంతపెట్టే పెద్దవాణ్ణిగనుక నామాటనీవు త్రోసివెయ్యవని మాటపదహార్లుయిస్తే ఆలోచిస్తానని చెప్పినాను. అందుకు ఆయనవప్పుకొన్నాడు. నేను మీతల్లివంటిదానిని, కాబట్టి నీవుయిందుకు వప్పుకో. రామయ్యషావుకారుగారు యీవాళ రారు.

గరు — రామయ్యగారు విన్నారంటె యీలాటి దగాముండఅని నిందించరా.

వేశ్యమా — ఆయనకు తెలుస్తుంది గనుకనా. ఆభయమేమీ నీకు అవసరం లేదు.

గిరు—నీవు నామంచికోసమున్నా, నాకుడబ్బు రావాలని వుద్దేశ్యంతో చెప్పుతూవున్నప్పుడు నీమాట తీసివేస్తే యేం బాగావుంటుంది ?

వేశ్యమా—మనలో యిదిమామూలే కన్నెరికంఅంటేగాని ఎక్కువ డబ్బురాదుగనుక యప్పటికప్పుడే మాపిల్లకింకా కన్నెరికం కాలేదు అని వంకపెట్టుతూవుండడం మనలో ఆచారమే. నీవు ఆవిషయం సందేహించవద్దు. (తనలో) దీనిని యెల్లాగయినా ఆనాయుడికిగూర్చి, ఆతనిదగ్గిరవున్న యింటితనఖాదస్తావేజు లాక్కోవాలి. ఇదేమంచిసమయం.

గిరు—(తనలో) పోనీ వూరికేపోనియ్యడం యెందుకు నూరురూపాయలు. వూరికేకూర్చుంటె వస్తాయా. ఆరామయ్యగారు ఈవాళరారుగదా. (ప్రకాశముగా) పెద్దమ్మా నీమాటకాదనలేను.

వేశ్యమా—సరే అల్లాగయితే నాయుడుగారిని రాత్రికిరమ్మని కబురు పంపుతాను. రా.

(నిష్క్రమించును.)



రంగము:—[ఒంటరిగా రామయ్య ప్రవేశము.]

రామ—(తనలో) అన్నా ! ఈ వేశ్యలను నమ్మగూడదు. ఎంతధనమిచ్చినా వీళ్ళకు సంతృప్తియనుమాట కడుపులో కంచుకాగడాపెట్టి చూచిననుగాని కనుపించదు. నేను మహాశ్రమపడి ఏలూరు నుంచి ఆగరుడాచలాన్ని కన్నెరికంకోసం పిలిపిస్తే ఆముండ యెంత మాదర్చోదీపనిచేసింది. ఎవరో నాయుడువస్తే వాడిదగ్గిర వందరూపాయలు పుచ్చుకొందట. ఆలోచించగా ఇది దీనికి బుట్టినబుద్ధిలాలేదు. ఆచకోరాక్షితల్లి యిది అంతాచేసింది. ఆముసలిముండ ఆనాయుడుకు ఏమో డబ్బు యియ్యవలెనట. దీన్నికూరుస్తే ఆ అప్పు అడగడం మానేస్తాడుగదా అనియిల్లా

చేసింది. ఒక వేళ ఆముసల్ది బోధిస్తేమాత్రము యిది యిల్లాచే యాలి. గానీ మించిపోయింది. తీరా అది వెళ్ళినతరువాత తెలిసింది. ఒక వేళ వున్నప్పుడు తెలిసినా యేమిచేస్తాను ? వలపు కొద్దీ 500 రూపాయలూ ముందు యిచ్చివేశానుగదా. ఆహా! ఈవేశ్యలు యెంతకయినను జాలుదురు. సుజ్ఞానులయిన వారు వీళ్ళ జాతిలక్షణాలు కనిపెట్టే వీళ్ళపొందు రోతయనిశాస్త్రము లలో చెప్పినారు. ఛీ! ఎంతధనమిస్తేనేమి? కుక్కని తీసుకొని వచ్చి సింహాసనంమీద కూర్చోపెట్టితేమాత్రం దాని గుణము అది వదలుతుందా.

సీ. మాయమంత్రముబన్ని । పతితగుణాఢ్యుల
విటకాండ్రగాజేసి । వెలయుచుండ్రు
పటురాగమునుజూపి । విటకాండ్రవలపించి
ధనము నెంతైన గై । కొనుచునుండ్రు
వలపమందులఁబెట్టి । భర్తలు సతులను
విడనాడగాజేసి । వెలయుచుండ్రు
కపటంబు ప్రేమంబు । కల్పించిజారుల
సేవకుల కరణిని । జేయుచుండ్రు

తే. గీ. నిదియు నదియంచు । మదిని నెన్నఁ
నరముకానట్టి నృత్యముల్ । ధరణియందు
సలుపగాజాలుదురు వెల । సతులు; వారి
వలచి, చెలగెడిపురుషుల । బ్రతుకురోత.

తే. గీ. ధనము నిచ్చినవాడెపో । ధన్యుడంచు
వలపు జూపించుచుండెడి । వనితకెట్లు
మదిని ననురాగమేరీతిఁ । గుదిరియుండు
తృప్తియనుమాట నెట్టులు । తెలియగలదు.

సీ. వ్యభిచారవృత్తి జీ । వనముగాభావించి
ధర్మమార్గముబీడి । తనరుచుందు
వరుసవావులులేక । పశువర్తనముదాల్చి
కుంటిగుడ్డియనక । గూడుచుందు
వేళపాళలులేక । విత్తమిచ్చినవాడి
ధవుడంచువానితో । దనరుచుందు
ద్రవ్యంబునాసించి । తగనికార్యములెన్ని
యైననుగావించి । యలరుచుందు
తే. గీ. కరుణయన్నది యావంత । గానలేము
ప్రేమయన్నది పూజ్యమై । వెలయుచుండు
అమిత మాయగుణంబుల । కాటపట్టు
వారసతుల జేరెడివారి । బ్రతుకుగోత.

సీ. మిసమిసవన్నెలన్ । మోహమందగ నెమ్మొ
గమువంచి యొకని గ్రే । గంటజూచు
కనులు చిట్లించుచు । గమనీయమగు పైట
జారించియొకనిని । సైగజేయు
చిలుకపల్కులగతి । లలితమగుముద్దు
మాటలనొక్కని । మరలుగొలుపు
గబ్బిగుబ్బలజూచి । యుబ్బి తబ్బిబ్బులా
డగ నొక్కరునకు । కవుగలినొసంగు
తే. గీ. యొకనితో ముచ్చటలుసల్పు । నొకనిజేరు
నొకని ముద్దిడుచుండు వే । రొకనిగొట్టు
మోహనాస్త్రంబు భంగిని । ముగుద; విటుల
హృదయ ధనములనింతలో । నెమ్మిగొనును.

ఛీ! ఇట్టి వారాంగనలను చేరుట పరమ అసహ్యకరము. ధనగర్వము

చేత కన్నును మిన్నును తెలియక మొదటవున్న డబ్బంతాతగ లేశాను. ఎంతడబ్బిస్తే యేమిలాభంవుంది. ఇంకనైనా బుద్ధి తెచ్చుకొని జాగ్రత్తగా వుండాలి. వేశ్యలపొందు నేనేగాక యెవ్వరు చేయకుండా వుండురుగాక.

చ. పరువు ప్రతిష్ఠలన్నియును ౹ బాయును; ద్రవ్యము గూర్చుకొంటకై తలుచగుచుండు యోచనలు ౹ దగ్గరబంధువు లేరు రారు సో దరులును దిట్టుచుండెదరు ౹ దల్లియు దండ్రియు లోనగుందు; సుం దరియు ననేకభంగులను ౹ దైన్యమునొందును చిత్తమందునన్॥

(నిష్క్రమించును.)



రంగము:—[సింహాచలము, చంద్రవదన.]

చంద్ర—అమ్మాయీ! మనకు మంచి అండఅయిన వెంకటాద్రియ్య గారు పరమపదించారుగదా. పాపము.

సింహా—అమ్మా! మనజాతిలక్షణంచేత ఆయనవున్నప్పుడు వాళ్లతో వీళ్లతోను తిరగేదాన్నిగాని ఆయన నామీదచూపించే ప్రేమ తలచుకొంటే నిజాగా యేడుపువస్తుంది. ప్రపంచకంలో వేశ్యలను వుంచుకొన్నవాళ్ళు ఆయన పెట్టినంతడబ్బు యెవ్వరుపెట్టినారు! నిజాగా యిప్పుడు మనదగ్గిర నిలవవున్నడబ్బు ఆయన వల్ల సంపాదించిందేగదా.

చంద్ర—అవునమ్మా! ఇక నీకు సహస్రజన్మాలుయెత్తినా అల్లాటిఅండ దొరకదు. జరిగిపోయిందానికి విచారిస్తే యేమిలాభంవుంది. ఎల్లాగో మనకులవృత్తి మనకుదప్పదు. వూరుకుంటే యేంలాభమువుంది. కాని సింహాచలమూ అన్నీ బాగానేవున్నాయిగాని, మీఅక్కయ్య చేసేపనిమాత్రం యేమీ బాగాలేదు.

వుంచుకొన్నాయన యెంతోడబ్బు యిస్తున్నాడు చాలాసంపా యిస్తూవుంది. కాని యేంలాభము? నిలబెట్టుకోలేదు. ఆకృష్ణ మూర్తి దానికి పోకేళ్లీ భర్తయై వున్నాడు. ఇదిసంపాయించి నడబ్బల్లా అతనిచేతులో పెట్టుతూవుంది. ఆతడు లేకపోతే ఒక నిమిషమయినా వుండలేదు. ఆతడు బాగా దీనిని గోఉుగుతు న్నాడు. పోనీలే. ఏంచేస్తాము ?

[రామన్న ప్రవేశించును.]

చంద్రి—ఏంరామనా! ఏదోపనిమీద వచ్చినావు. పూరికేయెప్పుడూ వచ్చేవాడవుగావు.

రామ—(తనలో) వెనుక హైదరాబాదు జాగీరుదారుని యిచ్చటికితీ సుకొనివచ్చినప్పుడు ఐదునందల రూపాయిలు లాభంగలిగింది. ఈసింహాచలానికిగూడా ఆధర తగ్గిపోయింది. వెంకటాద్రియ్యా గారు చావగానే యీావి తగ్గింది. (ప్రకాశముగా) ఏముంది. పాపము. మీకుమంచి అండపడిపోయిందిగదా.

చంద్రి—అవును. ఏమిచేస్తాము. ఎంతపాపిస్తోందే. ఇప్పుడునువ్వువచ్చి నపని యేమిటో కాస్త చెప్పుదూ?

రామ—ఏముంది విశేషము. పట్నాలనుంచి నరసింహగారని ఒక ఆయన వచ్చినాడు. నెమ్మదిగాఆయన్ని యిక్కడకు యీరాత్రి వచ్చేయేర్పాటు చేదామనే ప్రదేశంవుందని మిమ్మల్ని కనుక్కొం దామని వచ్చినాను.

చంద్రి—ఏమిటో! ఈలాంటి స్వల్పములకు లోలికపోవడం యెందుకు ?

రామ—స్వల్పాలుకాకపోతే కాలము యెప్పుడూ ఒక్కమోస్తరుగ వుంటుందేమిటి? ఆమందలు వేలు వెంకటాద్రియ్యాగారితోనే పోయింది. ఇప్పుడుమళ్ళీ మామూలు వుంతలోకి అనగా 4-5 లో

పడ్డది. ఎల్లాగయితేనేమి కులవృత్తిగదా. చిల్లరసివాలక్ష్మి అన్నారు. ఎప్పుడూ ఒకటేనీమం పెట్టుకొనికూర్చుంటేయెల్లాగ.

సింహా—సరేగాని రామన్నా, నీయిష్టంవచ్చినట్లు యేర్పాటుచేయవచ్చునుగాని, నిన్నొకసంగతి అడుగుతాను, కోపంరాదుగదా, నిజంచెప్తావా?

రామ—బుర్రపోయినా కోపంరాదు. ఒకరి ప్రాణంపోయినా అబద్ధమాడను.

సింహా—వెనుక తీసుకొనివచ్చిన జాగీరుదారు మాఅమ్మకియ్యమని నీకు యెంత యిచ్చినాడు?

రామ—అయిదువందలేకా. మీఅమ్మకే అయిదునోట్లూయిచ్చేశాను. ఏమన్నా యెక్కువ యిచ్చేనన్నాడా యేమిటి?

సింహా—నిజంగా వేయిరూపాయిలు యిచ్చినానన్నాడులే.

రామ—దొంగనాకొడుకూ, అల్లాఅన్నాడూ. ఇన్నాళ్ళనుండి మీయింటికి వచ్చిపోతూవుంటాను. ఎప్పుడైనా యేవ్యాపారంలోనైనా తేడావచ్చిందా. కావాలంటే మిమ్మల్ని అడిగిపుచ్చుకొంటానుగాని దొంగపని నాకెందుకూ? మీరెప్పుడూ నావిషయంలో అల్లాఅనుకోవద్దు. నేనుఅల్లాచేసేవాణ్నిగాను. ఆమోస్తరుగా చెప్పిన జాగీరుదారు యిప్పుడెదురుగావుంటే నామూయలంజకొడుకును ముక్కలిఱగేసెదను. ఏమైనాసరే.

చంద్రి—ఎప్పటిసంగతో యిప్పుడెందుకు అమ్మాయీ!

రామ—అడిగితే తప్పేమిటి? అనుమానరహితం చేసుకొంటేమంచిది.

చంద్రి—అనుమానంలేదు గినుమానంలేదు. ఇంకనీవు వెళ్ళుదూ. మాకుభోజనంవేళ అయింది.

రామ—మాపటికి నేను చెప్పినాయన్ని తీసుకునివస్తాను.

చంద్రి—మంచిది. (నిష్క్రమించును.)

(అందరు నిష్క్రమింతురు.)



రంగము—సింహాచలము—నరసింహాము.

నర—(తనలో) నేను చాలామంది వేశ్యలను చూచినానుగాని యిల్లాంటి అందంగల మనిషిని యెక్కడను చూడలేదు. దీనికి ఇంత అందం వుండడంచేతనే యింటఆస్తి సంపాయించగలిగింది. అబ్బా! ఏమిమేడ! మేడంతా కడపనాపరాళ్ళచేత పఱుపబడి సిమెంటు చేయబడినది.

సింహా—ఏమిటి పంతులుగారు మహాఆలోచిస్తున్నారు?

నర—ఏమీలేదు. నీయొక్క వైభవాన్ని చూస్తే నాకు చాలా ముచ్చట వేస్తూంది. ఆ వెంకటాద్రిమయ్యగారు బ్రతికి వున్నప్పుడింకా యెంతవైభోగంగా వుండేదానవోగదా!

సింహా—ఆసంగతి యెత్తకండి నాకు దుఃఖం వస్తుంది. ఆయనమాట తలుచుకుంటే గుండెపగిలిపోతుంది. ఆయన సరసత్వము, ఆయన ధర్మగుణము, ఆయన ప్రేమ, ఎవ్వరికున్నా వుంటుందా, అట్లాంటిమనిషి యెన్నిజన్మాలు తపస్సుచేసినా దొరుకుతాడా!

నర—పాపము చాలా డబ్బు యిచ్చినాడట.

సింహా—ఒకడబ్బేఅన్నమాట యేమిటి? పోనిద్దురూ! ఇంక ఆ ప్రసంగము యెత్తకండి. అయిపోయిందేదో అయిపోయింది. (ఇంచుకయూరకుండి) తాంబూలం వేసుకోండి. (అని చేతికియ్యబోయి) అయ్యో! ఇదియేమిటి? చేతులు వణకుతున్నాయి. ఎన్నడూలేదు. ఇదేమిటో భయమేస్తూవుంది.

మిటో నాకూఅల్లాగేవుంది. అదిగో వికృతమైనస్వరూపమొకటి రాకంటికి అగపడుతూవుంది. మీయింట్లో పెయ్యాలుగాని బ్రహ్మరాక్షసులుగాని యేమయినా వున్నాయా యేమిటి?

—ఎప్పుడూ మాయింట్లో అల్లాటివి లేవండీ.

అదృశ్యస్వరూపమున నెవరో చెంపకాయగొట్టగా) అబ్బా! ఇది యేమిటి, సింహాచలమూ ఏదో భూతంలాగువుంది. ఎదురుగా ఎలుచుంది. చెంపకాయ గూబలుగుయ్యమనేటట్టు వేసి ఆత్తేక ఇంతడబ్బుదీనికి నేనిచ్చి కర్మంచేత స్వర్గానికివెళ్ళితే నీవుదీని దగ్గిరకు వచ్చావా అని గొంతుక్కాయ పిసుగుతూవుంది. యిబాబూ! భోగందానితో సరసంవద్దూ పల్లకాపూ వద్దు. ఎల్లా యినా అవతలపడితే చాలురా బాబూ.

—(గడగడ వడకుచుండును.)

లమున్నూ, నరసింహమున్నూ హఠాత్తుగా నేలబడుదురు.)

లేచి) వోయి బాబో. చచ్చిన వెంకటామయ్య బ్రహ్మరాక్షసి అయినాడురా బాబూ. ఆపున నన్నుతరుముతున్నాడు నాడని డబ్బుపోయి శనిపట్టిందన్న మోస్తరుగా వుందిరా బాబూ. ఇంకదీనిగడప తొక్కరాదు. ఎవళ్ళువచ్చినా యిల్లాగే శాస్తి అవుతుంది. (పరుగెత్తుకొని పోవుచున్నాడు.)

—(బిగ్గరగా) అయ్యబాబో! అయ్యబాబో! నాయినో! (కేకలు వేయును.)

[చంద్రవదన ప్రవేశించును.]

—(ప్రవేశించి) ఇదేమిటే! ఇలా కేకలువేస్తావు?

—అదుగో బ్రహ్మరాక్షసి. నామీదకు దూకుతూవుంది. నాగొంతుక్కాయ నొక్కేస్తూవుంది నన్ను చెంపకాయలు

వేస్తూవుంది. నేను ఎంతో డబ్బుయిస్తే విశ్వాసం లేకుండా యొకరిని చేరనిస్తున్నావా! అని అంటూవుంది.

చంద్రి—(తనలో) ఇదెక్కడమాయపీడ. ఇదంతా వెంకటాద్రినాయుడు గారి చర్యలావుంది. చచ్చినవాడు చావక దయ్యమై బాధించడం మొదలుపెట్టినాడు. బాగానేవుంది ఖర్మం. భూతవైద్యులను బిలిపించియిందులకు తగిన గట్టిపని యేదయినా చేస్తేనేగాని లాభంలేదు. (ప్రకాశముగా) అమ్మాయీ! భయపడకురా ఏమీలేదు. ఏదోకాస్త జడుసుకున్నావు. (లోనికి తీసుకొనివెళ్ళిపోవును.)

సంపూర్ణము.

